# కమ్యూనిస్టు పార్టీ నిర్మాణము

## కమ్యూనిస్టు ఇంటర్నేషనలు-మూడవ కాంగ్రెసు 1921.

### 1. సాధారణ సూత్రములు

1. పార్టీ ఆశయమునకు, అదిపని చేస్తున్న పరిస్థితులకు అనుగుణ్యంగా పార్టీనిర్మాణం వుండాలి. విప్లవవర్గపోరాటము అన్ని దశల్లోనూ, సోషలిజము సాధించే తర్వాత దశలోను అనగా, కమ్యూనిస్టుసమాజవు మొదటిదశలోను కార్మికవర్గం అగ్రగామిగాను, మొనగాడుగాను కమ్యూనిస్టుపార్టీవుండాలి.

2. మార్పు, తిరుగులేని నిర్మాణరూపము కమ్యూనిస్టు పార్టీలకు వుండజాలదు. నిరంతర పరిణామములో పొందుతున్న పరిస్థితుల మూలకంగా, కార్మికవర్గ పోరాటంలో మార్పులు వస్తాయి. ఈ మార్పులకు అనుగుణంగా కమ్యూనిస్టుపార్టీ నిర్మాణంకూడా తదనుగుణ్యమైన రూపాలను నిరంతరం తీసికుంటూవుండాలి. అలాగేవివిధదేశాల్లోని ప్రత్యేకపరిస్థితులు, ఆయా పార్టీల నిర్మాణ స్వరూపాలను నిర్ణయించుతాయి.

కాని ఈ తేడాకుకూడా హద్దులున్నాయి. ఎన్ని ప్రత్యేక లక్షణాలున్నప్పటికిన్నీ, అన్ని దేశాల్లోనూ, విప్లవము వివిధ దశల్లోను కార్మికవర్గ పోరాటపరిస్థితులు ఒకే విధంగా ఉన్నాయి. ఇది అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి అత్యంత ప్రధానము. అన్ని దేశాల్లోనూ కమ్యూనిస్టు పార్టీల నిర్మాణానికిఒకేపునాదిని ఏర్పరుస్తుంది.

ఈపునాదిపైననే కమ్యూనిస్టుపార్టీలనిర్మాణమును బల పరచాలి. కాని యిప్పుడున్న పార్టీలను రద్దుచేసి ఆదర్శవంత మైన కొత్తపార్టీలను నిర్మాణం చేయడానికై ప్రయత్నించ రాదు. ఆదర్శవంతమైన, పార్టీ నియమావళి లోపరహితమై సంపూర్ణమైన నిర్మాణరూపముగల పార్టీలను నిర్మించడానికి ప్రయత్నం చేయరాదు.

3. అత్యధిక కమ్యూనిస్టుపార్టీలకు, అందుమూలంగా- ప్రపంచవిప్లవ కార్మిక వర్గానికి ఐక్యపార్టీఅయిన కమ్యూ నిస్టు ఇంటర్నేషనలుకూ, పోరాటపరిస్థితుల్లో ఈ సామాన్య లక్షణమున్నది. బలంగాఉన్న బూర్జువాకు వ్యతిరేకంగా ఇవి యింకా పోరాడవలసియుంది. బూర్జువాను జయించడం, దాని నుంచి అధికారం లాగుకోవడమున్నూ, కొత్తపరిస్థితులు ఏర్పడేవరకూ ప్రధానలక్ష్యంగా ఉంటుంది. కాన బూర్జువా మీద విజయమునకు అవకాశము యిచ్చేట్టి, తథ్యముచేసే టటువంటి సంస్థలను నిర్మాణం చేయడం, పెట్టుబడిదారీ దేశా ల్లోని కమ్యూనిస్టుపార్టీల నిర్మాణ క్రమంలో ప్రధాన కార్యంగా ఉంటుంది.

4. సమిష్టికార్యాచరణకు నాయకత్వం ప్రధానం: ప్రపంచచరిత్రిలో మహత్తరమైన యీపోరాటంలో మరింత

ముఖ్యం. కార్మికవిప్లవములో కమ్యూనిస్టు నాయకత్వాన్ని నిర్మాణము చేయడమే, కమ్యూనిస్టుపార్టీని నిర్మాణం చేయడం.

పార్టీ మంచి నాయకుడుగా ముందుకు రావలయునంటే పార్టీకిమంచి నాయకత్వం ఉండాలి. గాన విప్లవ కార్మికోద్యమములో నాయకత్వం వహించేలాగున కమ్యూనిస్టుపార్టీలను సామర్థ్యంగల శాఖలక్రింద ఏర్పాటుచేయడం, నిర్మాణం చేయడం, తర్ఫీదుచేయడం— మన నిర్మాణ కార్యక్రమములో ప్రధానంగా ఉంటుంది.

5. పోరాటపరిస్థితిలోనిరంతరం మార్పులువస్తుంటాయి. వీటికి అనుగుణంగా కమ్యూనిస్టుపార్టీ, దాని నాయకత్వ సంస్థలు మార్చుకోగల్గిన శక్తకలిగి ఉండాలి. అవకాశ మున్నంతలో పెద్ద దెబ్బతీసే శక్తికలిగి ఉండాలి. విప్లవవర్గ పోరాటంలో నాయకత్వానికి ఈ రెంటిసమైక్యత అత్యవసరం. పైగాకార్మికప్రజాసామాన్యంతో సన్నిహితసంబంధం కలిగిఉండాలి. సంబంధంలేకుండా ప్రజలకు నాయకత్వం వహించి నడిపించజాలదు, మహా అయితే ప్రజల వెనుక పోగలదు.

కేంద్రీకృత ప్రజాస్వామ్యముద్వారా కమ్యూనిస్టు పార్టీ నిర్మాణములో నిర్మాణ ఐక్యత సాధించాలి.

## 2. కేంద్రీకృత ప్రజాస్వామ్యము

కమ్యూనిస్టుపార్టీ నిర్మాణములో కేంద్రీకృత ప్రజాస్వామ్యము అంటే, కార్మిక ప్రజాతంత్రములో కేంద్రీకరణను నిజంగా సమ్మిళితము చేయడమే. పార్టీ యావత్తు

నిరంతర సమిష్టి కార్యాచరణ, నిరంతర సమిష్టిపోరాటం పునాదిపైననే ఈ సమ్మిళితం సాధించగలదు. కమ్యూనిస్టు పార్టీలో కేంద్రీకరణ అంటే నామమాత్రపు మెకానికలు కేంద్రీకరణ కాదు. కమ్యూనిస్టు కార్యాచరణ యొక్క కేంద్రీకరణ; అనగా యుద్ధానికి సన్నద్ధమై ఉండి, అదేకాలములో మార్పుచేసుకోగలిగిన శక్తిగల బలమైన నాయకత్వాన్ని నిర్మించుకోవడమే. మిగిలిన సభ్యులమీద గాని, పార్టీ బయట నున్న విప్లవ కార్మికవర్గ ప్రజలమీదగాని పెత్తనం చేసే కొద్దిమంది చేతుల్లో 'అధికారము' కేంద్రీకరించడము నామమాత్రపు కేంద్రీకరణ, మెకానికలు కేంద్రీకరణ. కార్మికవర్గ పోరాటాలను నడుపుతూ, కమ్యూనిస్టు నాయకత్వాన్ని కేంద్రీకరణచేస్తూ, కార్మికవర్గము మీద పార్టీ పెత్తనం చేయుడానికి ప్రయత్నించుచున్నదని పార్టీ విరోధులు మాత్రమే చెప్పగలరు. ఈ వాదన శుద్ధ అబద్ధము. కమ్యూనిస్టు ఇంటర్నేషనలుచే ఆమోదించబడిన కేంద్రీకృత ప్రజాస్వామ్యము పార్టీలో అధికార పదవులకొరకు పోటీ పడడానికి పెత్తనంకోసం ప్రాకులాడడానికిగాని, తావీయదు.

బూర్జువా ప్రభుత్వయంత్రంలో 'ప్రజలకు' నిరంకుశవాదులకు మధ్య ద్వంద్వభావమున్నది. ఈ ద్వంద్వభావమే విప్లవకరముకాని పాత కార్మికఉద్యమములో ప్రవేశించింది. ఈ ప్రమాదకరమయిన బూర్జువా వాతావరణం సజీవమైన సంబంధానికి బదులుగా, నిష్ఫలమైన, నామమాత్రపు ప్రజాస్వామ్యానికి దారితీసింది. పనిచేసే కార్యకర్తలు, పనిచేయని ప్రజలుగాసంస్థలను చీల్చింది, బూర్జువా వాతావరణం మూల

కంగా విప్లవకార్మికోద్యమంలోకికూడా ఈ ద్వంద్వత్వం, నామమాత్ర కేంద్రీకరణ కొంతవరకు ప్రవేశించుతాయి.

నిరంతర అభివృద్ధి, పునర్విమర్శనద్వారాను, రాజకీయ, నిర్మాణపనిని పద్ధతిప్రకారం ఓర్పుతో సాగించుట ద్వారాను కమ్యూనిస్టుపార్టీ ఈ వైరుధ్యాలను ప్రధానంగా అధిగమించాలి.

7. సోషలిస్టు ప్రజాపార్టీని కమ్యూనిస్టుపార్టీగా మార్చేటపుడు పూర్వవిధానాన్ని యథాప్రకారమే ఉంచి, తమ కేంద్ర నాయకత్వంలో అధికారము కేంద్రీకరించడంతో సరిపోదు. కేంద్రీకరణ కాగితంమీద సాధించితే చాలదు. నిజంగా సాధించాలి. తమ కార్యకలాపాల్లోను, పోరాటాల్లోను బలమైన ఆయుధంగా సభ్యులందరూ దీనిని గుర్తించినపుడే ఇది సాధ్యమవుతుంది. లేనియెడల ఇది పార్టీలోని నిరంకుశ పెత్తనంగా ప్రజలకు కన్పించుతుంది. అందువల్ల అదిప్రజల్లో ఎట్టి కేంద్రీకరణకు, నాయకత్వానికి గట్టి డిసిప్లినుకు వ్యతిరేకతను రెచ్చగొడుతుంది. నిరంకుశత్వానికి వ్యతిరేకత అరాజకత్వానికిదారితీస్తుంది.

ప్రజాస్వామ్య ప్రాతిపదికపైననే నిరంకుశత్వము: అరాజకత్వపు ధోరణులు ఉద్భవిస్తాయి. వీటిల్లో దేనిని కూడా నామమాత్రపు ప్రజాస్వామ్యము తొలగించజాలదు గాన, కేంద్రీకరణ అనగా, బలమైన నాయకత్వాన్ని సృష్టించడం. నామమాత్రపు ప్రజాస్వామ్య పునాదిపైన జయప్రదం కాజాలదు. నాయకత్వ సంస్థలకు సభ్యులకు మధ్యను పారీకి పారీ బయటనున్న కార్మిక ప్రజల మధ్యను సజీవమైన

పరస్పర సంబంధాలు ఏర్పరచడం దీనిని సాధించడానికి ప్రాతిపదిక కాగలవు.

## 3. కమ్యూనిస్టు కార్యక్రమ కర్తవ్యాలు

8. విప్లవమార్గాన్ని సృజానికి తర్ఫీదు యిచ్చే స్కూలుగా కమ్యూనిస్టుపార్టీ ఉండాలి. పార్టీ కార్యక్రమంలో దైనందిన సమిష్టి పనిద్వారా పార్టీ శాఖలకు, పార్టీ సభ్యులకు మధ్య ఐక్యత ఏర్పడుతుంది.

చట్టబద్ధమైన (Lawful) కమ్యూనిస్టుపార్టీల్లో ఈరోజుకు కూడా సభ్యులందరు పార్టీ నిత్యకార్యక్రమంలో పాల్గొనడం లేదు. ఈ పార్టీల ప్రధానలోపము అదే. ఆ లోపమే వీటి అభివృద్ధికి ఆటంకంగా ఉంటున్నది.

9. కార్మికులపార్టీ కమ్యూనిస్టుపార్టీగా మారుతున్న ప్రథమదశలో యింతవరకు ప్రచారంలో పెట్టిన పాతసిద్ధాంతాలకు బదులు కమ్యూనిస్టు సిద్ధాంతాలను ప్రవేశ పెట్టడంతోను, కమ్యూనిస్టుకార్యక్రమం అంగీకరించడంతోను, శత్రుముఠాకు చెందిననాయకులను తొలగించి కమ్యూనిస్టులను ఎన్నుకోవడంతోను, సంతృప్తిపడే ప్రమాదం ఉన్నది. కమ్యూనిస్టు కార్యక్రమము అంగీకరించడంఅంటే కమ్యూనిస్టును కావలయుననే అభిప్రాయాన్ని వ్యక్తపరచడము మాత్రమే. పార్టీ సభ్యులందరూ పార్టీపనిలో నిరంతరం రోజూ పాల్గొనడం పార్టీ కార్యక్రమాన్ని నెరవేర్చడంలో మొదటి మెట్టు. కమ్యూనిస్టు కార్యాచరణ లోపించియున్నట్లయితే, పార్టీసభ్యుల్లో యింకా నిస్తబ్ధత ఉన్నట్లయితే, కమ్యూనిస్టు

కార్యక్రమాన్ని నెరవేర్చుతామని తీసుకున్న ప్రతిజ్ఞలో కనీసభాగంకూడా నిర్వర్తించలేదని అర్థం.

కార్మికవర్గ పోరాటములో ప్రతిపార్టీసభ్యుని వినియోగించుకోవడం, సభ్యులందరికీ పార్టీపనిని విభజించడం, సభ్యుల ద్వారా విప్లవోద్యమానికి కార్మిక ప్రజలను నిరంతరం ఆకర్షించడం లోనే కమ్యూనిస్టుసిద్ధాంతమున్నది. పార్టీబలము మూలంగానే గాకుండా అధికారము, శక్తి, విశాలానుభవము, విజ్ఞానము, సామర్థ్యములవల్ల ఉద్యమాన్ని నడుపడంయావత్తు పార్టీ తనచేతుల్లో ఉంచుకోవాలి.

10. నిజంగా పనిచేసే సభ్యులే పార్టీలో ఉండేలాగున కమ్యూనిస్టుపార్టీ చూడాలి. ప్రతిసామాన్య సభ్యుడు, పరిస్థితులనుబట్టి తనకున్న యావత్తుకాలాన్ని, శక్తిని పార్టీకే వినియోగించేలాగున, యిందుకుగాను తనశక్తిసామర్థ్యాలు అన్ని వినియోగించేలాగున పార్టీ ప్రయత్నించాలి.

కమ్యూనిస్టు కార్యక్రమం అంగీకరించడంతోబాటు, పార్టీసభ్యులకు యింకా బాధ్యతలున్నాయి; మొదట కాండిడేటుగాను, తర్వాత సభ్యుడుగాను నమోదు చేయించుకోవడం, సభ్యత్వరుసుం రెగ్యులరుగా చెల్లించడం, పార్టీపత్రికకు చందాదారవడం మొదలైనవి. పార్టీనిత్యకార్యక్రమంలో ప్రతిసభ్యుడూ పాల్గొనడం అన్నిటికంటె ముఖ్యమైనది.

11. పార్టీపనిని నెరవేర్చడానికిగాను ప్రతిపార్టీసభ్యుడు పార్టీలోని చిన్నగ్రూపు, కమిటీ, కమిషను, పెద్దగ్రూపు, ఫ్రాక్షను, సెల్లు, ఏదోఒకదానిలో తప్పనిసరిగా సభ్యుడయి తీరాలి. ఇలావుంటేనే పార్టీపనిని విభజించడం, నడపడం, నెరవేర్చడం సక్రమంగా జరుగుతుంది.

స్థానిక పార్టీ సమావేశాలకు హాజరుకావలసిన అవ్వ సరంగూర్చి వేరే చెప్పవలసిన అవుసరంలేదు. పార్టీకి లీగలు (చట్టబద్ధ) అవుకాశాలుండినపుడు ఈ సమావేశాలకు బదులుగా స్థానిక ప్రతినిధుల సమావేశాలు జరపడం మంచిది కాదు. ఈ సమావేశాలకు పార్టీ సభ్యులందరూ హాజరు అయితీరాలి. కాని యింతమాత్రంతోనే చాలదు. ఈ సమావేశాలను ఏర్పాటుచేసేముందు చిన్న గ్రూపుల ద్వారా గాని, ఆయా పనులమీద నియమించిన సభ్యులద్వారాగాని పని జరిగియుండాలి; కార్మికుల సమావేశాలకుగాని, ప్రదర్శనాలకుగాని, ప్రజా కార్యాచరణకుగాని, జరిగినసన్నాహాలను ఈ సమావేశాలు పూర్తిగా వినియోగించుకోవాలి. ఈ కార్యకలాపాలకు సంబంధించిన బాధ్యతలను చిన్నగ్రూపులలోనే ఆమూలాగ్రంగా పరిశీలించుకోడానికి, సంపూర్తిగా నెరవేర్చడానికి అవుకాశం ఉంటుంది. వర్కుర్ల చిన్న గూపుల మధ్య విభజించిన పార్టీ సభ్యత్వం యావత్తు పార్టీ కార్యక్రమంలో నిత్యమూ ఈవిధంగా పాల్గొనియుడల, వర్గపోరాటములో పాల్గొనాలని చేసే ఎంతతీవ్ర ప్రయత్నాలయినా సరే, ఈ పోరాటాలను నడిపించడంలో బలహీనంగాను నిరుపయోగంగాను ఉంటాయి; శ్రామికవర్గ విప్లవ శక్తులను, శక్తివంతమైన, ఐక్య కమ్యూనిస్టు పార్టీలోకి సమీకరించడానికి దారితీయవు.

12. సకాలంలో ఆందోళన, పఠన, పత్రికపని. సారస్వత పంపకము, వార్తాపత్రిచారము, నిరంతర కార్యక్రమము మొదలయిన వాటిని నిర్వర్తించడానికి వివిధశాఖల్లో పార్టీ సెల్లులను ఏర్పరచాలి.

ఫ్యాక్టరీల్లోను, కర్మాగారాల్లోను, కార్మిక సంఘాల్లోను, కార్మికసంస్థలు సైనిక యూనిట్లు మొదలయినవాటిల్లో పార్టీసభ్యులుగాని, కాండిడేట్లుగాని కనీసం కొద్దిమందైనా ఉన్న ప్రతిచోటా కమ్యూనిస్టుకార్యక్రమము నిర్వర్తించడానికి పార్టీ సెల్లులు మూలముగా ఉంటాయి. ఒకే ఫ్యాక్టరీ యూనియను మొదలయినవాటిల్లో ఎక్కువ సభ్యులున్నపుడు సెల్లును శాఖలుగా విస్తృతం చేయాలి. సెల్లులను నడిపించే బాధ్యత దీనికి ఉంటుంది.

విస్తృతమైన వ్యతిరేక శాఖను ఏర్పరచవలసి రావచ్చు. లేదా యిప్పటికే ఏర్పడిఉన్న వాటిల్లో పాల్గొనవలసిరావచ్చు. అప్పుడుప్రత్యేకసెల్లు ద్వారా దానినాయకత్వాన్ని తీసికోడానికి కమ్యూనిస్టులు ప్రయత్నించాలి. కమ్యూనిస్టుసెల్లు పనిచేస్తున్న ప్రాంతంలోగాని, ప్రజాసామాన్యంముందుగాని పార్టీసెల్లు బహిరంగంగా రావాలా లేదాఅనేవిషయం. ఆ ప్రత్యేకపరిస్థితుల్లో అందుమూలంగా వచ్చేలాభనష్టాలను పూర్తిగా పరిశీలించిన మీదటనే నిర్ణయించుకోవాలి.

ప్రజాపార్టీలుగాఉన్న కమ్యూనిస్టుపార్టీల్లో సభ్యులందరి చేత పనిచేయించడం ఈ చిన్నగ్రూపులను నిర్మాణం చేయడం చాలాకష్టమైనపని. ఇదంతా ఒక్కసారే సాధించజాలరు. ఇందుకు, నిరాశనెరుగని పట్టుదల, పరిపక్వత, చాలాశక్తి అవుసరము.

ఈ నూతననిర్మాణవిధానము ఆచరణలోపెట్టేటపుడు మొదటినుంచి జాగ్రత్తగా పనిచేయడం అత్యవసరం. పార్టీ సభ్యులందరినీఒక కాగితపుప్లానుప్రకారం సెల్లుల్లోకి గ్రూపు

ల్లోకి విభజించడం, తర్వాత పార్టీ నిత్యకార్యక్రమంలో వీరం దరూ పనిచేయాలని పిలుపు ఇచ్చివేయటం తేలికయినపనే. అసలు ప్రారంభించకుండా ఉండేదానికంటే ఇలా ప్రారంభించడం నష్టకరము; ఇలా చేయడంవల్ల ఈ ముఖ్యమైన మార్పుల యెడల పార్టీసభ్యులకు అసంతృప్తి, ఏవగింపు ఏర్పడుతుంది.

చైతన్యవంతులయినట్టిన్ని, వివిధ కేంద్రాల్లో ఉద్యమ పరిస్థితిని అవగాహన చేసుకున్నట్టిన్ని, సమర్థులయిన ఆర్గనైజర్ల సలహాలను పార్టీముందుగా తీసికోవాలి. ఈ మార్పులను ప్రవేశపెట్టడానికి వివరమయిన ప్లాను వేసుకోవాలి. ఆ తర్వాత తర్ఫీదు పొందిన ఆర్గనైజర్లు గాని, లేదా ఆర్గనైజింగు కమిటీలుగాని, ఆయా ప్రాంతములలోపని ప్రారంభించాలి. గ్రూపులనాయకుల ఎన్నికలుజరపాలి. పనిలో మొదటి దశను ప్రారంభింపచేయాలి. అన్ని సంస్థలకు, గ్రూపులకు, సెల్లులకు, వ్యక్తులకు నిర్దిష్టమయిన స్పష్టమయిన పనిఈయాలి. ఈ పని ఇచ్చేటప్పుడు, అది చేయదగినదిగాను, చేయగల్గినదిగాను ఉపయోగకరమయినదిగాను వారికి బోధపడాలి. అవసరమున్నచోట ఈ పనులను ఎలానిర్వర్తించాలో చేసి చూపించాలి. అదేకాలములో త్రొక్కరాని తప్పుడుమార్గాలనుగూర్చి హెచ్చరించాలి.

14. పార్టీ ఈపునర్నిర్మాణపు పనిని ఒక్కొక్కమెట్టే ఆచరణలోపెట్టాలి. స్థానిక పార్టీలో అనేకగ్రూపులు, సెల్లులు మొదట్లో ఏర్పరచరాదు. ముఖ్యఫ్యాక్టరీల్లోను, కార్మికసంఘాల్లోను విడదీసినసెల్లులు బాగాపనిచేస్తున్నాయని, పార్టీకార్యక్రమపుముఖ్యశాఖల్లో వర్కర్ల గ్రూపులుయేర్పరచామని, అవి కొంతవరకు బలపడ్డాయని, (ఉదా : సమాచారశాఖ, రవాణా

శాఖ, మహిళాపుద్యమము, ఆందోళన, పత్రికపని, నిరుద్యోగ పుద్యమము మొదలయినవి) మొదట రుజువు చేయాలి. నూతననిర్మాణ విధానం, కొంత ఆచరణలోకి వచ్చేవరకూ, పాతనిర్మాణ చట్రాన్ని విచ్ఛిన్నంచేసి వేయరాదు. అత్యంత సామర్థ్యంతో కమ్యూనిస్టు నిర్మాణపు ఈ ప్రధాన కార్య కమము ప్రతిచోటా అత్యంత శక్తివంతంగా నిర్వర్తించాలి. లీగలు పార్టీలే గాకుండా రహస్య పార్టీలమీదకూడా ఈ విషయంలో చాలా భారమున్నది.

కార్మికవర్గ పోరాటములో అన్ని కీలక స్థానాల్లోను కమ్యూనిస్టు సెల్లులు, ప్రాక్షనులు, కార్మికుల గ్రూపులు వల లాగా అల్లుకుపోయే వరకు, నిత్యవిప్లవ కార్యక్రమంలో ప్రతి సభ్యుడు తన భాగాన్ని నెరవేర్చువరకూ సభ్యులకు ఇది సహజమైన అలవాటయిపోయేవరకు, ఈ బాధ్యతను నిర్వ హించడంలో పార్టీకి విసుగు విరామము వుండరాదు.

15. ఈ ప్రాథమిక నిర్మాణమును నిర్వహించుటలో పార్టీపనినినిరంతరం నడపడంలోను ఆపనిమీద పలుకుబడిసంపా దించడములోను నాయకత్వసంస్థలమీద పెద్దబాధ్యతవున్నది. ఇందుకుగాను, ఆయా పార్టీకమిటీలకు నాయకత్వం వహించుతున్న ముఖ్య కామ్రేడులు పలువిధములైన చొరవ చూపించాలి. పార్టీపనిలో కామ్రేడ్సు- స్త్రీలు, పురు షులు-నిమగ్నులయ్యేట్టుగా కమ్యూనిస్టు కార్యక్రమానికిబాధ్యత వహిస్తున్నవారు. చూడడమేగాకుండా, పార్టీకలు అనుభ వముతోను, ప్రత్యేకపరిస్థితులకు అనుగుణంగాను, ఈపనికి సహాయపడాలి, నడుపాలి. పోరాటాశయాన్ని ఎన్నడూ మరువకుండా తమ పని విధానమును నిరంతరం అభివృద్ధి

చేసుకుంటూ ఉండాలి. తమ సాక్రికలు అనుభవాన్నిబట్టి తమపనిలో ఏమయినా తప్పులుచేశారోలేదో తెలుసుకోడానికి ప్రయత్నించాలి.

16. సిద్ధాంతవిషయాలమీదగాని, ప్రాక్టికలువిషయాల మీదగాని, ప్రత్యక్షపోరాటం. లేదా పోరాటానికి సన్నా హాలుచేయడంలోనే మన పార్టీపని అంతాఉన్నది. దీనిలో నిపుణత్వం సంపాదించడం ఇంతవరకు చాలా లోప భూయిష్టంగాఉంది. చాలా ముఖ్యమయిన శాఖల్లో అప్పు డప్పుడు మాత్రమే పనిచేయడం జరుగుతున్నది. రహస్యశాఖ (CID)ను ఎదుర్కోవడంలో లీగలుపార్టీలు చాలాతక్కువగా పనిచేశాయి. పార్టీసభ్యులను అభివృద్ధి చేసేవిషయంలో సర్వ సామాన్యంగా పని నామమాత్రంగానే జరుగుతున్నది. దీనికి ప్రాముఖ్యతఈయడంలేదు, దీనిఫలితంగా పార్టీముఖ్యమైనతీర్మా నాల్లోఎక్కువభాగము, కమ్యూనిస్టుఇంటర్నేషనలుపార్టీ కార్య క్రమము, తీర్మానాలుకూడ, పార్టీసభ్యుల్లో చాలామందికి తెలియవు. నైపుణ్యం (Specialisation) లో ఉన్నతస్థాయి సంపాదించడానికిగాను పార్టీ అన్నికమిటీల్లోను, పార్టీయావత్తు నిర్మాణ యంత్రముద్వారా నిరంతరము పద్ధతిప్రకారము పార్టీసభ్యులను అభివృద్ధిచేయాలి.

17. రిపోర్టులుపంపడం కమ్యూనిస్టు కార్యక్రమములో ఒకభాగము. ఇది పార్టీ ప్రతిసభ్యుని, పార్టీ ప్రతిసంస్థ, కమిటీ బాధ్యత. కొద్దికాలమునకు సంబంధించిన జనరలురిపోర్టులు పంపుతూఉండాలి. పార్టీ ప్రత్యేక కమిటీల పనినిగూర్చి ప్రత్యేకరిపోర్టులుండాలి. పార్టీసత్ సాంప్రదాయాల్లో రిపోర్టులు. పంపించడం ఒకటి అయిపోయేట్టుగా చేయడం అత్యవసరం.

18. కమ్యూనిస్టు ఇంటర్నేషనలు నాయకత్వకమిటీకి ప్రార్టీ ప్రతిమూడు నెలలకు రిపోర్టు పంపుతూఉండాలి. పార్టీలో పై కమిటీకి క్రిందకమిటీ రిపోర్టు పంపుతూఉండాలి. (ఉదా : స్థానిక శాఖలు ఆయాకమిటీలకు నెలసరి రిపోర్టులు పంపాలి.)

ఏపార్టీ కమిటీ క్రింద పనిచేస్తున్నారో ఆకమిటీకి ప్రతి సెల్లు, ఫ్రాక్షను, కార్మికుల గ్రూపు తమరిపోర్టులను పంపాలి. సభ్యులకు సంబంధించిన సెల్లులకుగాని, కార్మికుల గ్రూపుకు గాని (నాయకునకు) సభ్యులు తమ రిపోర్టులను అందజేయాలి; ప్రత్యేకపనిని నెరవేర్చినపుడు, ఆబాధ్యత యిచ్చిన పార్టీ కమిటీకి రిపోర్టు యివ్వాలి.

వీలయినంత త్వరగా రిపోర్టు పంపించాలి. వ్రాత పూర్వకమైన రిపోర్టుకావాలని పార్టీగాని, పని యిచ్చినవారు గాని అడిగితే తప్ప, రిపోర్టు నోటితో చెప్పాలి. రిపోర్టులు క్లుప్తంగాను, విషయానికి సంబంధించిఉండాలి. ప్రచురించితే ప్రమాదంవచ్చే రిపోర్టులను భద్రపరచడానికి రిపోర్టులు తీసికున్నవారు బాధ్యులు. ముఖ్యమైన రిపోర్టులు అందుకు సంబంధించిన పార్టీకమిటీలకు ఎట్టి ఆలస్యమూ లేకుండా పంపించడానికి రిపోర్టులు తీసికున్నవారిదే బాధ్యత.

19. తాముచేసిన పనికి సంబంధించి రిపోర్టులుఉండాలి. పార్టీ కార్యక్రమాన్ని నిర్వర్తించడంలో, మన పోరాటానికి ముఖ్యమయిన ఘటనలు బయిటికివస్తే వాటిని, మనభవిష్యత్తు కార్యక్రమాన్ని అభివృద్ధిచేయడానికి గాని, మార్పుచేయ డానికిగాని ఉపయోగపడే ఘటన ముఖ్యాంగాలు రిపోర్టులో ఉండాలి. కార్యక్రమాన్ని నిర్వర్తించుచున్నపుడే, పని

అభివృద్ధికి అవుసరమైన సూచనలు గోచరించవచ్చు. అట్టి సూచనలను రిపోర్టులో తెలియజేయాలి.

పార్టీ అన్ని సెల్లుల్లోను, బ్రాంచిలలోను, కార్మికుల గ్రూపుల్లోను, వాటికివచ్చిన రిపోర్టులమీద, అవి పంపించాల్సిన రిపోర్టులమీద విపులంగా చర్చ జరగాలి. ఈ చర్చలు నిత్య అలవాటయిపోవాలి.

వ్యతిరేక సంస్థలనుగూర్చి ముఖ్యంగా పెటీ బూర్జువా వర్కర్ల సంస్థలను గూర్చి ప్రాముఖ్యంగా 'సోషలిస్టు' పార్టీ నిర్మాణముగూర్చి పార్టీ సభ్యులుగాని, సభ్యుల గ్రూపులు గాని పరిశీలించుతూ వుండాలి. రిపోర్టుచేయాలి. ఇందుకుగాను సెల్లుల్లోను, కార్మికుల గ్రూపులలోను బాధ్యతఈయాలి.

## 4 ప్రచారము, ఆందోళన

20. విప్లవ ప్రచార ఆందోళన సాగించడము, బహిరంగ విప్లవ పోరాటంయెడల మన ముఖ్య సాధారణబాధ్యత. ఈ పని, దీని నిర్మాణము యింతవరకూ పాతపద్ధతులమీదనే జరుగుతున్నది. బహిరంగసభల్లో అప్పుడప్పుడు ఉపన్యాసాలు మాత్రం యిస్తున్నారు. కాని ఉపన్యాసాల్లోను, వ్రాతల్లోను విప్లవసరుకు ఎంతవున్నదీ అనే దానిమీద శ్రద్ధవహించడం లేదు.

కార్మికుల సమిష్టికోర్కెలు ఆశయాలద్వారాను, ముఖ్యంగా వారి సమిష్టి పోరాటాలద్వారా, కమ్యూనిస్టు ప్రచారం ఆందోళన కార్మికుల్లో వ్రేళ్ళుపాతుకు పోవాలి.

కమ్యూనిస్టు ప్రచారం విప్లవతత్వంతో కూడుకొని వుండాలనేది అన్నిటికంటే ముఖ్యమైన విషయం. గాన

కమ్యూనిస్టు సిద్ధాంతాలనుగూర్చి ప్రత్యేక సమస్యలపైన కమ్యూనిస్టు దృక్పథంగూర్చి మనం ప్రత్యేకశ్రద్ధ వహించాలి.

సరియైన దృక్పథం అలవరచుకోడానికి కొద్దిమంది నిపుణులైన ఆందోళనాపరులు, ప్రచారకులమీద ఆధారపడితే చాలదు. పార్టీ యితర మెంబర్లనుకూడా అభివృద్ధి చేసుకోవాలి.

21. కమ్యూనిస్టు ప్రచారంలో ముఖ్యరూపాలు.

1. వ్యక్తిగత వాచాప్రచారము.

2. పారిశ్రామిక, రాజకీయ కార్మికోద్యమంలో పాల్గొనడం

3. పార్టీపత్రికద్వారా ప్రచారం, సారస్వత పంపకం. రహస్యపార్టీ లీగలుపార్టీలలో ప్రతిసభ్యుడు వీటిల్లో ఏదోఒక దానిలో రెగ్యులరుగా పాల్గొనాలి.

కార్మికులప్రత్యేక గ్రూపులద్వారా యింటింటికితిరిగి కాన్వాసు (Conuass) చేసేరూపాన్ని వ్యక్తిగతప్రచారం తీసికోవాలి. ఈ కాన్వాసింగులో పార్టీపలుకుబడిఉన్న ప్రాంతంలో ఒక్కయిల్లుకూడా వదలకూడదు. పెద్దపట్టణాల్లో వాల్ పోష్టర్లు (Wall posters) కరపత్రాలు పంచిపెట్టడం, పద్ధతి ప్రకారం చేసినట్లయితే సంతృప్తికర ఫలితాలు సామాన్యంగా వస్తాయి. వీటితోబాటు ఫ్యాక్టరీలు కర్మాగారాల్లో సారస్వతం పంచాలి. నిరంతరం వ్యక్తిగతంగా ఆందోళన చేస్తూ ఉండాలి.

అల్పసంఖ్యాకజాతులున్న దేశాల్లో, ఈజాతుల కార్మికుల్లో ప్రచారము, ఆందోళన చేయడానికి పార్టీ తగుశ్రద్ధ వహించాలి. ఈ ప్రచారము ఆందోళన, అల్పసంఖ్యాకజాతుల

భాషల్లోనే జరుపాలి. పార్టీ ఇందుకుగాను అవుసరమైనప్రత్యేక శాఖలను నిర్మించాలి.

22. కొన్ని పెట్టుబడిదారీ దేశాల్లో కార్మికుల్లో అధిక భాగము యింకా విప్లవచైతన్యం పొందలేదు. ఈ వెనుకబడిన కార్మికులకు నచ్చజెప్పి వారిని విప్లవముఠాలో జేర్చుకోడానికిగాను కమ్యూనిస్టు ప్రచారం నిరంతరము నూతన పద్ధతులను అన్వేషించుతూ ఉండాలి. బూర్జువా సాంప్రదాయాలకు దృక్పథాలకు వ్యతిరేకంగా పోరాడ కార్మికులకు మనస్సులో ఉబలాటమున్నది. కాని యిది యింకా చైతన్యం పొందనట్టి, ప్రూగిసలాట ప్రదర్శించే, అసంపూర్ణమైన అర్ధబూర్జువా విప్లవధోరణిలోనే ఉంటుంది. ఇలాంటి వాటినన్నింటిని కమ్యూనిస్టు ప్రచారము తన నివాదాలతో బయటికి తీసుకరావాలి.

కార్మిక ప్రజలుకోరే సంకుచితమైన అస్పష్టమైన కోర్కెలతోను, ఆశయాలతోను కమ్యూనిస్టు ప్రచారము సంతృప్తిపడరాదు. ఈకోర్కెలలోను ఆశయాల్లోను విప్లవబీజాలున్నాయి. కమ్యూనిస్టు ప్రచార పలుకుబడి క్రిందకు కార్మికులను తీసుకరావడానికి ఇవిసాధనాలు.

23. కార్మిక ఉద్యమానికి, పరాక్రమవంతమైన, తెలివిగల, శక్తివంతమైన, విశ్వాసపాత్రమైన నాయకుడుగా కమ్యూనిస్టుపార్టీని గుర్తించేలాగునను కార్మికుల్లో కమ్యూనిస్టు ఆందోళనఉండాలి.

ఇవి సాధించడానికి కార్మికుల ప్రతిపోరాటములోను, ఉద్యమములోను కమ్యూనిస్టులు పాల్గొనాలి. పని ఘంటలు, జీతాలు మొదలయిన వాటిమీద పెట్టుబడిదారులతో కార్మి

కులు జరిపే అన్ని పోరాటాలను సమర్థించాలి. కార్మికుల జీవిత సమస్యలనుగూర్చికూడా కమ్యూనిస్టులు ఎక్కువగా శ్రద్ధవహించాలి. ఈ సమస్యలమీద కార్మికులు సరైన దృక్పథము అలవరచుకోడానికి సహాయపడాలి. మరీ నిక్కృష్టంగా ఉన్న విషయాలమీదకు, కార్మికుల దృష్టిని మరల్చాలి. వాటిమీద కష్టంగాను, విస్పష్టంగాను వారికోర్కెలను నిర్మించడానికి సహాయపడాలి. ఈ విధంగా కార్మికుల్లో ఐక్యతత్వాన్ని, దేశములోని కార్మికుల అందరి ఆశయాలు ఒకటే అనే ఐక్య కార్మికవర్గ చైతన్యాన్ని, తద్వారా ప్రపంచ కార్మికవర్గ సైన్యంలో తాము ఒకభాగమనే చైతన్యాన్ని రేకెత్తించాలి.

కార్మికుల అన్ని పోరాటాల్లోను ఈ విధంగా పాల్గొనడంద్వారానే, ప్రాథమికమైన రోజువారీ కార్యక్రమము నెరవేర్చుట ద్వారానే కమ్యూనిస్టు పార్టీ నిజమయిన కమ్యూనిస్టు పార్టీగా అభివృద్ధికాగలదు. పార్టీసభ్యులను రిక్రూటు చేసుకోవడంతో సరిపుచ్చుతూ, పార్లమెంటరీ విధానంద్వారా విజయం సాధించవచ్చని చెబుతున్న శుద్ధ సోషలిస్టు ప్రచారము అనబడే దానినుంచి, ఈ విధానాలు అవలంబించుటద్వారానే విస్పష్టంగాపార్టీ ఉండగలదు. దోపిడీ దారులమీద, దోపిడీ చేయబడుతున్న వారినిత్యపోరాటాల్లో పార్టీ సభ్యులందరూ ఆత్మత్యాగంతోను, చైతన్యవంతంగాను పాల్గొనడం విజయానికి అవుసరము. కార్మిక నియంతృత్వాన్ని జయప్రదం చేయడానికి మరింతఅవుసరం. పెట్టుబడిదారీ విధాన దాడికి వ్యతిరేకంగా కార్మిక ప్రజల చిన్న చిన్న యుద్ధాల్లో కార్మిక ప్రజలకు నాయకత్వం వహించుట ద్వారానే కార్మిక వర్గానికి మొనగాడుగా కమ్యూనిస్టుపార్టీ

తయారుకాగలదు. అధికారం కొరకు బూర్జువామీద జరిపే పోరాటములో కార్మిక వర్గానికి నిర్మాణయుతమైన నాయకత్వం వహించగల శక్తి సంపాదించగలదు.

24. కార్మికోద్యమములో పాల్గొనడానికి గాను, సమ్మెలు, లాకౌటులు, కార్మికులను తీసివేయడం మొదలయిన సమయాల్లో కమ్యూనిస్టుల పూర్తిశక్తిని సమీకరించాలి.

కార్మికులు తమ పరిస్థితుల్లో కొద్ది అభివృద్ధికొరకు నేడు పోరాటాలు జరుపుతున్నారు. కమ్యూనిస్టు కార్యక్రమము అంతిమ ఆశయాలకొరకు సాయుధ విప్లవపోరాటమే కావాలి అనే వంకలతో ఈపోరాటాలను కమ్యూనిస్టులు కొంచపరచడంగాని, లేదా తమకు పట్టనట్టుగా ఊరుకోవడంగాని పెద్ద తప్పు. పెట్టుబడిదారులతో నేడు పోరాడడానికి కార్మికులు ఎంతచిన్నకోర్కెల మీదనయినా సరే సంసిద్ధమయినపుడు, ఈ పోరాటాల్లో కమ్యూనిస్టులు పాల్గొని తీరాలి. కోర్కెలు చిన్నవిగా ఉన్నవనే నెపం మీద ఎన్నడూ పాల్గొనకుండా ఉండరాదు. కాని కార్మికులను అర్థంలేని సమ్మెలకు, అనాలోచితమయిన కార్యాచరణకు రెచ్చగొడుతున్నారనే నేరానికి మన ఆందోళన తావీయరాదు. పోరాటాల్లో కమ్యూనిస్టులు ధైర్యంగాను శక్తివంతముగాను పాల్గొంటారనే పలుకుబడిని పోరాడుతున్న ప్రజల్లో కమ్యూనిస్టులు సంపాదించాలి.

25. కార్మికోద్యమములోని సెల్లులు (శాఖలు) నిత్యజీవిత సాధారణ సమస్యలమీద ఆచరణలో ఏమీ చేయజాలకుండా ఉన్నాయి. కమ్యూనిజం సూత్రాలను బోధించుతూ కూర్చోవడం తేలికే, గాని నిష్ఫలం. తర్వాత

సమస్యలను ఎదుర్కోవలసి వచ్చినప్పుడు సిండికేలిస్టు తప్పుడు ధోరణికి ఇది దారితీస్తుంది. ఈవిధానం అనుసరించడంద్వారా ఆంస్టరుడాం ఇంటర్నేషనలు చేతుల్లో పడిపోతారు.

సమస్యను అన్నివైపులనుంచి పరిశీలించి కమ్యూనిస్టులు కార్యక్రమంలో దిగాలి.

ఉదాహరణకు వేతనాలు, పనిపరిస్థితులనుగూర్చిన అగ్రిమెంటులను సిద్ధాంతరీత్యాను, సూత్రాలమీదను వ్యతిరేకించుతూ కూర్చుంటే చాలదు. ఆంస్టరుడాం నాయకులు సిఫార్సు చేసిన వేతనఅగ్రిమెంటులమీద పోరాటాలకునాయకత్వంవహించాలి. పెట్టుబడిదారులు, వారి తాబేదారులయిన ఆంస్టరుడాం నాయకులు, అనేక అగ్రిమెంటులద్వారా, కార్మికుల చేతులు బంధించి వేస్తారనేది విదితమే. కార్మికవర్గవిప్లవ సంసిద్ధతకు అడ్డంకులుగాఉన్న వాటన్నింటినీ ఖండించడం, ఎదుర్కోవడం అవసరమే. గాన ఈఅగ్రిమెంటుల అసలు ఆశయములను గూర్చి కార్మికులకు కనువిప్పుచేయడం కమ్యూనిస్టుల బాధ్యత. కార్మికులను బంధించనిఅగ్రిమెంటులు చేసుకోవడంద్వారా కమ్యూనిస్టులు దీనిని సాధించగలరు.

కార్మికసంఘాల లక్ష్యాలయిన నిరుద్యోగ, జబ్బు భృతులు మొదలయిన వాటినిగూర్చిగూడా ఇదే దృక్పథం అవలంబించాలి. పోరాట నిధిని ఏర్పరచడం, సమ్మెకాలంలో వేతనాలు మంజూరుచేయడం అవసరంగా చేయదగినవి.

కాన ఇట్టి కార్యక్రమాన్ని సూత్రాలమీద వ్యతిరేకించడంసరైనదికాదు. కానిఆంస్టరుడాంవాదులు చెప్పినట్లుగా ఈ నిధులను ప్రోగుచేయడం, వినియోగించడం, కార్మికుల క్షేమానికే భంగకరమని కమ్యూనిస్టులు తెలియజేయాలి.

జబ్బు భృతి మొదలయినవాటికి కార్మికులనుంచి వసూలు చేయడాన్ని రద్దుచేయాలని కమ్యూనిస్టులు పట్టుబట్టాలి; కార్మికులు స్వయంగా వసూలుచేసుకున్న నిధిమీద ఏర్పరచిన షరతులను రద్దుచేయడానికి పోరాడాలి. మనం ఇంతచేసినా కార్మికసంఘ సభ్యులు కొందరు తమ భాగాన్ని చెల్లించడం ద్వారా జబ్బుభృతిని సంపాదించాలని చూడవచ్చు. దీనిని నిషేధిస్తే మనలను తప్పుడు అర్థంచేసుకుంటారు, గాన వాటిని మనం నిషేధించరాదు. తీవ్రమయిన వ్యక్తిగత ప్రచారం ద్వారా యిలాంటివారిని తమ బూర్జువా దృక్పథంనుంచి మరల్చాలి.

26. సోషలు డెమొక్రాటిక్కు, పెటీబూర్జువా కార్మిక నాయకులతోను, తదితర లేబరుపార్టీ నాయకులతోను పోరాటంలో, వారికి నచ్చచెప్పడంద్వారా ఏదో సాధించగలుగుతామని ఆశించరాదు. వీరికి వ్యతిరేకంగా పోరాటం తీవ్రంగా జరపాల్సిందే. ఇందుకు మార్గం, పెట్టుబడిదారులకు సాధనాలుగా వుపయోగపడుతున్న ఈ విద్రోహకర సోషలిస్టుల అసలు రంగును కార్మికులముందు బయట పెడుతూ, వారికి పలుకుబడి లేకుండా చేడయమే, యీ నాయకులన బడే వీరి ముసుగును కమ్యూనిస్టులు లాగివేయాలి. తర్వాత వారిమీద తీవ్రంగా దాడిచేయాలి.

ఆంస్టర్డాం నాయకులను (అనగా సంస్కరణ వాద కార్మిక సంఘాల నాయకులను, మితవాదులు (పసుపుపచ్చ రంగు) అని పిలవడంతోనే సరిపోదు, ప్రత్యక్ష ఘటనలద్వారా నిరంతరం వీరిరంగును బయటపెట్టాలి. ఆంస్టర్డాం నాయ

కులు కార్మికసంఘాల్లోను, నానాజాతి సమితి యొక్క అంత ర్జాతీయ లేబరుబ్యూరోలోను, బూర్జువా మంత్రివర్గాల్లోను, ప్రభుత్వంలోను అవలంబించే కార్యక్రమాన్ని, పార్లమెంటులోను, మహాసభల్లోనుఇచ్చే విద్రోహకర ఉపన్యాసాలను, వారి పత్రికా ప్రకటనలను అన్నింటికంటె ముఖ్యంగా వేత నాలు కొద్దిగా పెంచడానికై జరిపెడు పోరాటాల్లోకూడా వీరు అవలంబించే ఊగిసలాట విధానాన్ని, వెనుకకులాగే విధానాన్ని ఉపన్యాసాలద్వారాను, తీర్మానాలద్వారాను బయటపెట్టాలి.

ప్రాక్షనులు తమ అగ్రగామిపాత్రను సక్కగా నిర్వ హించాలి. చిన్న కార్మిక సంఘోద్యోగులు, మంచి ఉద్దే శాలనేకలిగి ఉన్నప్పుడుకూడా, తమ బలహీనతకొద్దీ, పై అధికారులనుంచి ఆర్డర్లులేవనీ, సంఘ నియమావళి అనీ; రూల్సు అనీ అడ్డుచెబుతూ, పురోగమనాన్ని అరికడుతూ ఉంటారు. కమ్యూనిస్టులు వీటికి ఎన్నడూ లోనుగారాదు. నిరంకుశచట్టం కార్మికుల పురోగమనానికి అడ్డంకులుగా ఏర్ప రచిన వాటినన్నింటిని తొలగించడానికి చిన్న ఉద్యోగుల మీాద ఒత్తిడి తీసుకరావాలి.

27. కార్మికసంఘాల కాన్ఫరెన్సుల్లోను, సభల్లోను కమ్యూనిస్టులు పాల్గొనడానికి ఫ్రాక్షనులు సన్నాహాలు చేయాలి. ఉదాహరణకు సూచనలను ఫ్రాక్షనులు విపులీక రించాలి, ఉపన్యాసకులను ఏరుకోవాలి. శక్తిసామర్థ్యాలు, అనుభవంగల కామ్రేడ్సును ఎన్నికల్లో అభ్యర్థులుగా నిల బెట్టాలి. పార్టీ వ్యతిరేకసంస్థలు ఏర్పరచిన కార్మిక సభలు ఎన్నికల సమావేశాలు, ప్రదర్శనాలు రాజకీయ దినోత్స

వాల విషయంలో ప్రోత్సాహం ద్వారా కమ్యూనిస్టుపార్టీ సర్వ సన్నాహాలు చేసుకోవాలి. కమ్యూనిస్టులుపిలచిన కార్మిక సభలకు ప్రేక్షకుల్లో కమ్యూనిస్టులను విభజించి కూర్చో బెట్టాలి. పరిచార సత్సాంలితాలు సంపాదించడానికి సర్వ ప్రయ త్నాలు చేయాలి.

28. నిర్మాణపరచని కార్మికులను వెనుకబడిన కార్మి కులను పార్టీలోకి పర్మనెంటుగా ఇముడ్చుకోవడము కమ్యూ నిస్టులు నేర్చుకోవాలి. కార్మికులు కార్మికసంఘాల్లో చేరడా నికి, పార్టీపత్రిక చదువడానికి ప్రోత్సాహం సహాయంతో పని చేయాలి. పఠనాతరగతులు. స్పోర్ట్సుక్లబ్బులు, నాటక సమా జాలు, సహకారసంస్థలు, వినిమయదార్ల సంఘాలు, మొదల యినవాటిని పార్టీకి కార్మికులకు మధ్య సంబంధాలు ఏర్పరచే వాటిగా ఉపయోగించుకోవచ్చు. పార్టీ రహస్యంగా పని చేస్తున్నపుడు పార్టీ నాయకత్వకమిటీల ఆధ్వర్యాన, వాటి అనుమతితో, పార్టీకి బయట,పార్టీ సభ్యుల చొరవతో ఇట్టి సంఘాలను ఏర్పరచవచ్చు (సానుభూతిపరుల యూనియన్లు).

రాజకీయంగా ఏమీ పట్టించుకోని చాలామంది కార్మి కులను మేల్కొల్పడానికి కమ్యూనిస్టు యువజన, మహిళాసం ఘాలుసహాయకారిగాఉంటాయి. వాటిపఠనాతరగతులు,ఉత్స వాలు, ఆదివార సమావేశాలు, వినోదయాత్రలు, మొద లయినవాటి ద్వారాను, కరపత్రాలు పంచిపెట్టడం, పార్టీ పత్రిక అమ్మకం పెంచడంద్వారాను వీరినిపార్టీలోకి తీసుక రావచ్చు. విశాల ఉద్యమంలో పాల్గొనడంద్వారా కార్మి కులు బూర్జువా సంకుచిత ధోరణులనుంచి బయటపడతారు.

29. భూస్వాములతోను, పెట్టుబడి దారులతోను, పెట్టుబడిదారీ ప్రభుత్వముతోను అర్థకార్మికులు (Semiproletarians) గానున్న వారికి వైరుధ్యం ఉన్నది. దీనిని ఆధారంగా తీసుకుని, ఈ వర్గాలవారికి కార్మికవర్గముమీద నున్న అపనమ్మకాన్ని తొలగించి విప్లవ కార్మికవర్గానికి వీరినిసాను భూతిపరులుగా మార్చాలి. ఇందుకుగాను దీర్ఘ సంభాషణలు వారికోర్కెలను సానుభూతితో చూడడము, వారికష్టాల్లో ఉచిత సలహాలు, సహాయము చేయడము, వారి విద్యాభివృద్ధికి తోడ్పడడము మొదలయినవి అవసరమవుతాయి. వీటన్నింటి ద్వారా కమ్యూనిస్టు ఉద్యమములో వీరికి నమ్మకము ఏర్పడుతుంది. ఆయాజిల్లాల్లో అధికారపదవుల్లో ఉన్న శత్రుసంస్థల పలుకుబడిని, లేదా పెటీబూర్జువా రైతులమీద గృహపరిశ్రమల్లో పనిచేసే వారిమీద, తదితర అర్థకార్మికుల మీద వీరికున్న ప్రమాదకరమైన పలుకుబడిని తొలగించడానికి కమ్యూనిస్టులు కృషిచేయాలి. వీరిని పెట్టుబడిదారీ ప్రతినిధులుగా దోపిడీ చేయబడుతున్న వర్గాల ప్రజలు తమ అనుభవముద్వారా తెలుసుకుంటారు. వీరిదొంగ బురఖాలను కమ్యూనిస్టులు లాగివేయాలి. పెటీబూర్జువా ప్రజాతంత్రము, న్యాయము ఆదర్శాలకున్నూ, ప్రభుత్వనిరంకుశవిధానానికి మధ్యవచ్చే ఘర్షణలన్నింటినీ కమ్యూనిస్టు ఆందోళనలో చక్కగాను, శక్తివంతంగాను, వినియోగించుకోవాలి. కమ్యూనిస్టు ప్రచారాన్ని జిల్లాలోని అన్నిగ్రామాల్లోకి, అచ్చటచ్చటాఉన్న గృహాల్లోకి ప్రతిఇంటికి తీసుకపోవడానికిగాను స్థానికకమిటీ తనసభ్యుల మధ్యపనిని జాగ్రత్తగా విభజించాలి.

30. ఆయా దేశాల ప్రత్యేక పరిస్థితులకు అనుగుణంగా పెట్టుబడిదారీ ప్రభుత్వాల సైన్యంలోను, నావికాదళంలోను ప్రచారపద్ధతులుండాలి. శుద్ధశాంతివాదములాంటి సైనికతత్వ వ్యతిరేక (Anti miti firist) ప్రచారము చాలా ప్రమాదకరమైనది: కార్మికులను నిరాయుధులను చేయడంలో బూర్జువాకు ఆయుధంగా వుపయోగపడుతుంది. బూర్జువావర్గ బూర్జువా ప్రభుత్వ సైనిక సంస్థలనన్నింటికీ కార్మికవర్గం సిద్ధాంత రీత్యావ్యతిరేకం, వాటికి వ్యతిరేకంగా తీవ్రంగా పోరాడుతుంది. అయినప్పటికిన్ని రానున్న విప్లవయుద్ధాల్లో కార్మికులకు సైనిక తర్ఫీదుఈయడానికి ఈసంస్థలను (సైన్యము, సైనిక క్లబ్బులు, ప్రజారక్షణ సంస్థలు మొదలయినవి) ఉపయోగించు కొంటుంది. గాన యువకులకు, కార్మికులకు సైనిక శిక్షణ ఈయడానికి వ్యతిరేకంగా తీవ్రంగా ఆందోళనచేయరాదు. కార్మికులకు ఆయుధాలు యిచ్చే ప్రతి అవకాశాన్ని బాగా వినియోగించుకోవాలి.

సైన్యంలో ఆఫీసర్లకు ఎక్కువ సౌకర్యాలియ్యడం, సామాన్య సైనికులను సరిగా చూడకపోవడం, వారిజీవితంలో సాంఘిక భద్రతలేకపోవడంలో వర్గ వైరుధ్యం ప్రదర్శితమవుతుంది. దీనిని సైనికులకు విస్పష్టంచేయాలి. దోపిడీ చేయబడుతున్న వర్గభవిష్యత్తుతో సామాన్య సైనికుల భవిష్యత్తు ముడివడి వుందని ఆందోళనలో వారికివిస్పష్టంచేయాలి. విప్లవ స్థితి అభివృద్ధి అవుతున్న కాలములో, కమాండర్లను సామాన్య సైనికులు నావికులు ఎన్నుకోవాలని, సైనికుల కమిటీలు ఏర్పడాలని ఆందోళన చేయాలి. బూర్జువా ప్రభుత్వ

పునాదులను ఊపివేయడానికి ఇదిబాగా ఉపయోగ పడుతుంది.

వర్గ యుద్ధములో బూర్జువా ఉపయోగించే ప్రత్యేక సైనికదళాలకు, ముఖ్యంగా దాని వాలంటీరు దళాలకు వ్యతిరేకంగా ఆందోళనచేయడంలో అత్యంతశ్రద్ధ, జాగ్రత్తవహించాలి.

ఈ సైనిక వాలంటీరు దళాల సాంఘిక స్వభావము, (Composition) అవినీతి ప్రవర్తనవల్ల ఏర్పడిన ప్రతి అనుకూలపరిస్థితిని వాటిల్లో విచ్ఛిన్నత తీసుకరావడానికి ఆందోళనలో ఉపయోగించుకోవాలి. ఆఫీసర్లకోరులోలాగా బూర్జువా వర్గ లక్షణమున్న ప్రతిచోటా వీటిని ప్రజలముందు ఎత్తిచూపాలి. ప్రజలచేత అసహ్యించుకునేలాగున చేయాలి. దీనితో వీరు ఏకాకులయి, వారి లోపలనుంచే విచ్ఛిన్నం బయులుదేరేలాగా చేయాలి.

## 5 రాజకీయ పోరాట నిర్మాణము

31. పార్టీనిర్మాణము, రాజకీయకార్యక్రమము జరుపజాలని దశఅనేది కమ్యూనిస్టుపార్టీకి లేనేలేదు. ప్రతి రాజకీయ ఆర్థికపరిస్థితిని, వీటిల్లో వచ్చే మార్పులను ఉపయోగించుకోడానికిగాను వ్యూహనిర్మాణము, ఎత్తుగడలు అభివృద్ధి చేసుకోవాలి. తీవ్రరాజకీయ ఘటనలను, లేదా ఆర్థికవ్యవస్థ అంతకు సంబంధించిన విస్తృతమైన సమ్మెలను పార్టీ ఎంత బలహీనంగా ఉన్నాసరే, చక్కగా నిర్మాణం చేసుకున్న తీవ్రప్రచారం ద్వారా ఉపయోగించుకోవచ్చు. ఇట్టిప్రత్యేక పరిస్థితిని ఉపయోగించుకోవాలని పార్టీ నిర్ణయించుకున్నపుడు

ఈ కాంపెయినులో సభ్యుల, పార్టీ యూనిట్లశక్తిని కేంద్రీకరించాలి.

రాజకీయ ప్రాముఖ్యంగల కేంద్రాల్లోను, సమ్మెల్లోను పెద్ద సభలు జరుపడానికీగాను, కార్మికుల గ్రూపుల, సెల్లుల ద్వారా వచ్చిన సంబంధాలను అన్నింటినీ ఉపయోగించుకోవాలి. కమ్యూనిజము ఒక్కటే పోరాటాన్ని విజయవంతం చేయగలదని శ్రోతలను ఒప్పించడానికి పార్టీ ఉపన్యాసకులు ప్రత్యేక ప్రయత్నం చేయాలి. ప్రత్యేక కమీషనులు ఈ సభలకు పూర్తిసన్నాహాలను చేయాలి. ఏకారణాల చేతనయినా తన ప్రత్యేక సభలను పార్టీ ఏర్పాటు చేయజాలక పోయినట్లయితే, సమ్మెదారుల జనరలుబాడీ సమావేశాల్లోను, లేదా పోరాడుతున్న కార్మికుల్లోని కొందరు ఏర్పరచిన సభల్లోను తగిన కామ్రేడ్సు ఉపన్యసించాలి.

మనం పెట్టే డిమాండులను సభలో మెజార్టీగాని, చాలా భాగముగాని అంగీకరించే అవకాశ మున్నపుడు, వాటిని చక్కగా నిర్వచించాలి, వాదించాలి. తీర్మానాలు చేయాలి; అదే స్థలములోగాని, యితర ప్రాంతాల్లోగాని, ఏర్పాటుచేసిన సభల్లో అట్టి తీర్మానాలనే ఎక్కువ సభ్యులతోను, కనీసం బలమైన మైనారిటీలతోను ఆమోదింప జేయడానికి ప్రయత్నించాలి. ఈవిధంగా కార్మికవర్గాన్ని ఉద్యమములో సమీకరించగలం. మన నైతిక పలుకుబడి క్రింద వారినితీసుకురాగలం, మననాయకత్వాన్ని గుర్తింపచేయగలం.

ఈ సభల అనంతరం, ఈ సభల నిర్మాణంలో పని చేసిన, అవకాశాలను వినియోగించుకొన్న కమిటీలు పై

కమిటీలకు రిపోర్టు పంపడానికి, అనుభవంద్వారా వచ్చిన గుణ పాఠాలను నేర్చుకోడానికి, తప్పులను తెలుసుకోడానికి కాన్ఫరెన్సులను జరపాలి. ప్రతి ప్రత్యేకపరిస్థితికి అనుగుణంగా కార్మికుల కోర్కెలను గూర్చి పోస్టర్లద్వారాను, కరపత్రాలద్వారాను కార్మికుల్లో ప్రచారం చేయాలి. ఈవిధంగాకమ్యూనిస్టు పంథా పరిస్థితులకు అన్వయించుతుందని, కార్మికుల డిమాండుల ద్వారానే రుజువుచేయాలి. పోస్టర్లను సక్రమంగాపంచి, సరైన స్థలములో, సకాలంలో అంటించడానికి ప్రత్యేక దళాలు అవసరం. ఫ్యాక్టరీల్లోను, ఫ్యాక్టరీలముందు, కార్మికులు సమావేశమయే హాలుల్లోను, ప్రదేశాల్లోను పట్టణముఖ్య ప్రదేశాల్లోను, కరపత్రాలు పంచిపెట్టాలి. కరపత్రాలను పంచడంతోబాటు, కార్మికుల్లో చొచ్చుకుపోయే ఆకర్షణీయమైన, నినాదాలు యివ్వాలి, చర్చలు జరపాలి. అవకాశంవుంటే, వివరాలతోకూడిన కరపత్రాలు, ఫ్యాక్టరీల్లోను హాలుల్లోను, నివాసస్థలాలలోను మాత్రమే పంచిపెట్టాలి. ఈ కరపత్రాలలోని విషయాలను ఎక్కువగా శ్రద్ధవహించి వ్రాయాలి.

పోరాటం జరుగుతున్నప్పుడు, ఈ ప్రచారంతోబాటు అన్ని కార్మికసంఘాల్లోను, ఫ్యాక్టరీల్లోను, మనము జరిపే సభల్లోను, మనకు అనుకూలమైన సభల్లోను చొరవతో పని చేయాలి; మనదృక్పథానికి ప్రజలను త్రిప్పడానికి ఉపన్యాసకులు ప్రయత్నించాలి. ఇట్టి ప్రత్యేక వుద్యమాలకు మనపార్టీ పత్రికలు యెక్కువ స్థలము యియ్యాలి; మంచివార్తలతో దానిని బలపరాచాలి. కామేడ్సు తీవ్రంగా పనిచేయటానికి

గాను, పార్టీయం(త్రాన్ని అంతా యీ పనిమీదే కేంద్రీక
రించాలి.

32. ప్రదర్శనాలకు ఆత్మత్యాగంతోను, చొరవతోను
ఆ ప్రత్యేక పనియొక్క ఆశయంగూర్చి పట్టుదలతో పనిచేసే
నాయకత్వం ఉండాలి. ప్రదర్శనం, అవకాశమున్న అన్నిఫలి
తాలను సాధించినదా, ఆ ప్రత్యేక పరిస్థితిలో యింకా ప్రద
ర్శనాలు, సమ్మెలు, జనరలు సమ్మెలద్వారా ఉద్యమాన్ని
యింకా తీవ్రతరంచేసే అవకాశమున్నదా అనే విషయాన్ని
వీక్షణాన్నైనా నాయకత్వం తెలుసుకోగల్గియుండాలి. యుద్ధం
జరుగుతున్నపుడు శాంతికొరకై జరిపేప్రదర్శనాలు మనకు
ఒక పాఠాన్ని నేర్పాయి. ముందున్న సమస్య ప్రాముఖ్య
మైనదీ, ప్రజాసామాన్యమంతటికీ రోజురోజుకూ అవుసరమైనదీ
అయినపుడు, ఈప్రదర్శనాలను చెదరగొట్టిన తర్వాత కూడా
పార్టీ ఎంతచిన్నదయినాసరే, రహస్యంగా పనిచేస్తున్నాసరే,
కార్మికవర్గ నిజమైన పోరాటపార్టీ చేతులు ముడుచుకొని
కూర్చోరాదు, పెడమార్గాలు పట్టకూడదు, అని తెలియ
జేసింది. పెద్ద ఫ్యాక్టరీలను పునాదిగా తీసుకుని జరిపిన ప్రద
ర్శనాలు ఎక్కువ శక్తివంతంగా ఉంటాయి. వ్యక్తిగత
ప్రచారం ద్వారాను, కరపత్రాలద్వారాను, పార్టీ సెల్లులు,
గ్రూపులు ఒక ఘటనకు సంబంధించిన విషయంలో కొంత
వరకు ప్రజలను ఐక్య దృక్పథానికి, కార్యాచరణకు తీసుక
వచ్చిన తర్వాత సెల్లుల, గ్రూపుల నాయకుల, ఫాక్టరీల్లోని
నమ్మకమైన సభ్యుల సమావేశాన్ని పార్టీ కమిటీ జరపాలి.
నిర్ణీతదినములో జరుపవలసిన కార్యక్రమము, కాలము,
ఈయవలసిన నినాదాలు, విస్తృతం చేసే అవకాశాలు, ఆపి

వేసే కాలములనుగూర్చి దీనిలో నిర్ణయించుకోవాలి. ప్రదర్శనము ఫ్యాక్టరీల నుంచి బయలుదేరి పూర్తి అయ్యేవరకు అనుభవం సామర్థ్యంగలిగిన, ప్రజలతో కలసిపోతున్న నాయకులు ప్రదర్శనానికి వెన్నెముకగా ఉండాలి. నాయకులు ఒకరితో ఒకరు సంబంధం ఉంచుకోడానికి, వారికి రాజకీయ సూచనలు అందజేయడానికిగాను బాధ్యతగల కార్మికులు ప్రజల్లో పద్ధతి ప్రకారం మిళితమై తిరుగుతూ ఉండాలి. చలనసహితమైన రాజకీయంగా నిర్మాణమైన ఇట్టినాయకత్వం ప్రదర్శనాలను తిరిగి జరుపగలదు. కార్యక్రమాన్ని విస్తృతం చేసి తీవ్రంచేయగలదు.

33. కొన్ని కమ్యూనిస్టుపార్టీలు యిప్పటికే అంతరంగికంగా బలపడ్డాయి. తక్షీదయిన కాడరున్నది. ప్రజానీకంలో తగినంత పలుకుబడి ఉన్నది. ఈ పార్టీలు విస్తృతమైన కాంపెయినులద్వారా విద్రోహకర సోషలిస్టు నాయకులపలుకుబడి కార్మికవర్గము మీద లేకుండా చేయడానికి, అధిక సంఖ్యాక కార్మికులను కమ్యూనిస్టు నాయకత్వం క్రిందకు తీసుకురావడానికిసర్వప్రయత్నాలూచేయాలి. పరిస్థితులుపోరాటానికి అనుకూలంగా ఉన్నాయా, లేక తాత్కాలిక నిస్సత్తువ పరిస్థితి ఉన్నదా అనే వాటిమీద ఆధారపడి కాంపెయినులు వివిధరూపాల్లో నిర్మాణంచేయాలి. పోరాటమునకు అనుకూల పరిస్థితి ఉన్నపుడు పార్టీ కార్మికోద్యమమునకు నాయకత్వం వహించి నడపాలి.

ఇట్టి ఘటనలలో నిర్మాణవిధానాలు నిర్ణయించుకోవడంలో పార్టీలోని వర్గస్వభావముకూడా కొంతవరకు ప్రాధాన్యత వహిస్తుంది.

ఉదాహరణకు, కార్మికుల్లో ముఖ్య తరగతులను ఇవతలకు లాగడానికిగాను ఇతర దేశాల్లో కంటే జర్మనీలో 'బహిరంగ లేఖ' ప్రచురించే విధానాన్ని బాగా వినియోగించుకోగల్గారు. అప్పుడు వర్గ పోరాటము తీవ్రమవుతున్నది, కార్మిక వర్గము క్లిష్టపరిస్థితిలో ఉన్నది. విద్రోహక సోషలిస్టు నాయకుల ముసుగును లాగివేయడానికి జర్మనుకమ్యూనిస్టుపార్టీ 'బహిరంగ లేఖల'ను ప్రకటించింది. కార్మికుల నికృష్టపరిస్థితికి వ్యతిరేకంగా, వారికనీస కోర్కెలకొరకు, వారికి అన్నం పెట్టడానికి అయినా ఈ నాయకులు కమ్యూనిస్టుపార్టీతో కలసి పోరాడుతారా లేదా అని డిమాండు చేసింది.

ఈకాంపెయినులు తీసిన ప్రతిచోటా, దీనిని కార్మిక ప్రజలందరూ తెలుసుకోడానికిగాను కమ్యూనిస్టుపార్టీ పూర్తి సన్నాహాలు చేయాలి.

కార్మికసంఘు, ఫ్యాక్టరీ బహిరంగ సభలకు ముందు పూర్తిగా సంసిద్ధమవ్వాలి. కార్మికుల ముఖ్యకోర్కెల నన్నింటినీ ప్రతిబింబించుతున్న పార్టీడిమాండును ఈసభల్లో పార్టీయొక్క ఫ్యాక్టరీగ్రూపులు, కార్మికసంఘునాయకులు చర్చకు తీసుకరావాలి. ప్రజల ధోరణిని ఉపయోగించుకోడానికిగాను, మన డిమాండులను ప్రజలు బలపరచేలాగున చేయడానికి మనసెల్లులు, గ్రూపులు ప్రయత్నించుతున్న ప్రతి స్థలములోను కరపత్రాలు విరివిగా పంచాలి. పోష్టర్లు ప్రదర్శించాలి. ఈకాంపెయిను యావత్తుదశలోను సమస్యలను విశదీకరించడానికి మన పత్రిక నిరంతరం పనిచేయాలి. సమస్య వివిధదశలను అన్నిదృక్కోణాలనుంచి చిన్న వివరములతో కూడిన వ్యాసాలద్వారా నిత్యము విశదీకరించాలి. ఈవ్యాసా

లకు అవసరమయిన విషయాలను పత్రికకు నిరంతరముగా పార్టీ సప్లయి చేస్తూఉండాలి. పార్టీ కాంపెయినును ముందుకు తీసుకపోవడంలో సంపాదకులు అశ్రద్ధ చూపకుండా పార్టీ శ్రద్ధ వహించాలి. ఈపోరాటాలనుముందుకుతీసుకపోవడానికి మునిసిపాలిటీ, పార్లమెంటుల్లోని పార్టీగ్రూపులుకూడా చక్కగా పనిచేయాలి. పార్టీ నాయకత్వసలహా తీసుకుని తీర్మానాల ద్వారా ఈ ఉద్యమాన్ని చర్చకు తీసుకరావాలి. ఈ ప్రతినిధులు తాము బాధ్యతగల పార్టీ వర్కర్లుగాను, నాయకులుగాను, పోరాటం జరుపుతున్న ప్రజలయొక్క చైతన్యం పొందిన సభ్యులుగాను, తమ వర్గశత్రువు కాంపులో ఉండి కార్మికులతరఫున ప్రచారంచేసేవారుగాను తమను గుర్తించుకోవాలి.

కొద్దివారాల్లోనే, మన సంయుక్త, నిర్మాణయుత కార్యక్రమముద్వారా అనేక తీర్మానాలద్వారా మన డిమాండులను బలపరచేలాగున చేయడం తటస్థించవచ్చు. అప్పుడు, మనడిమాండులకు అనుకూలంగా ఉన్న ఈ ప్రజలను నిర్మాణము చేసుకోవడం పార్టీకి ప్రధానబాధ్యత అవుతుంది. ఉద్యమము కార్మికసంఘ స్వభావాన్ని తీసుకున్నట్లయితే, కార్మికసంఘాల్లో మన నిర్మాణపలుకుబడిని పెంపొందింపజేయడానికి ప్రయత్నించాలి.

స్థానిక కార్మికసంఘ నాయకులకు వ్యతిరేకంగా వారి పలుకుబడిని తొలగించడానికిగాని, లేదా మనపార్టీ డిమాండుల పైన నిర్మాణయుతమైన పోరాటము జరుపడానికి,వారిని లొంగదీయడానికి కార్మికసంఘాల్లోని మన గ్రూపులు, పురోగమించాలి. ఫ్యాక్టరీకౌన్సిల్లు, పారిశ్రామిక కమిటీలు మొద

లయినవి ఉన్న ప్రాంతాల్లో ఈ కమిటీలచేత, కౌన్సిళ్ళచేత పోరాటానికి అనుకూలంగా నిర్ణయింప జేయడానికిగాను ఆ జనరలుబాడీలద్వారా మనగ్రూపులు ఒత్తిడితీసుక రావాలి. కమ్యూనిస్టు నాయకత్వంక్రింద కార్మికుల కనీసజీవిత అవుసరాలకోసం జరిగే ఉద్యమాన్ని కొన్ని స్థానికసంఘాలు ఈ విధంగా బలపరచినపుడు, వాటి అన్నింటినీకలిపి ఒక కాన్ఫరెన్సు జరుపాలి. అనుకూల తీర్మానాలు చేసిన ఫ్యాక్టరీ సమావేశాల ప్రత్యేక ప్రతినిధులనుకూడా వీటికి ఆహ్వానించాలి.

## 6 నూతన నాయకత్వం

కమ్యూనిస్టు పలుకుబడిక్రింద ఈ విధంగా నూతన నాయకత్వాన్ని నిర్మాణంచేయాలి. కార్మికసంఘాల్లోని పార్టీ గ్రూపుల కేంద్రీకరణద్వారా ఈ నూతన నాయకత్వం మరింత బలపడుతుంది. సోషలిస్టు పార్టీలకు, కార్మిక సంఘాలకు పోరాట ఉత్సాహాన్ని ఇయ్యడానికి ఈబలాన్ని ఉపయోగించాలి. లేదా వాటి ముసుగును లాగివేయడానికి వినియోగించాలి.

పార్టీ పలుకుబడిక్రింద మంచి బలమైన సంఘాలుఉండి పార్టీ డిమాండులపైన ప్రజాబలాన్ని బాగా సంపాదించిన ప్రాంతాల్లో– ఈ ప్రాంతంలో అచ్చటచ్చటా జరుగుతున్న ఆర్థికపోరాటాలను, ఇతర గ్రూపులక్రింద అభివృద్ధి అవుతున్న ఉద్యమాన్ని, ఒకే సమగ్రమైన పోరాటముగా అభివృద్ధి చేయడానికి కార్మికసంఘాలద్వారాను, పారిశ్రామిక కౌన్సిళ్ల

ద్వారాను నిర్మాణయుతమైన ఒత్తిడి జయప్రదంగా తీసుకు రావాలి.

అప్పుడు కొన్ని వృత్తి కోర్కెలనుగాక, ప్రాథమిక డిమాండులను ఉద్యమము నిర్ణయించాలి. ఆ తర్వాత జిల్లాలోని అన్ని సంఘాల ఐక్యశక్తులను సమీకరించి ఈ డిమాండులను సాధించడానికి పూనుకోవాలి. ఇట్టి ఉద్యమములో పోరాటానికి సిద్ధమయివున్న కార్మికుల నాయకులుగా కమ్యూనిస్టుపార్టీ అప్పుడు రుజువుచేసుకుంటుంది. ఈ సంయుక్త నిర్మాణ పోరాటాన్ని వ్యతిరేకించే సోషలిస్టు నాయకులు, కార్మికసంఘాల నిరంకుశ పెత్తనదార్లు రాజకీయంగానే గాకుండా, ప్రత్యక్ష నిర్మాణ విషయాలమీదకూడా అసలు రంగులో బయటపడతారు.

34. రాజకీయంగాను, ఆర్థికంగాను తీవ్రమైన క్లిష్టపరిస్థితి మూలకంగా నూతన ఉద్యమాలు ఉద్భవిస్తాయి. అప్పుడు ప్రజలకు నాయకత్వం వహించడానికి కమ్యూనిస్టు పార్టీ కృషిచేయాలి. కొన్ని ప్రత్యేక డిమాండులను వదలుకొని అయినా సోషలిస్టు నాయకులకు కార్మిక సంఘాలకు విజ్ఞప్తులుచేయడం అవసరంకావచ్చు. నిరంకుశ నాయకులు పోరాటం లేకుండా చేయడానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా నికృష్ట పరిస్థితులు, నిర్బంధ విధానముమూలంగా యజమానులతో పోరాటముఎలాతప్పనిసరిఅయినదో ఆవిజ్ఞప్తులలో తెలియజేయాలి. రానున్న, వచ్చిన కార్మికుల పోరాటంలో నాయకత్వం వహించి నడుపడానికి కమ్యూనిస్టులు సిద్ధంగా ఉన్నారని, అణచబడిన వారందరికి సహాయపడడానికి కమ్యూ

నిస్టు పార్టీ సిద్ధంగా వున్నదని పార్టీ పత్రికలు, ముఖ్యంగా దిః పత్రికలు రోజు రోజు నొక్కి చెప్పాలి. పోరాటాలను తప్పించః డానికి, అడ్డుకుంటానికి పాత సంఘాలు ఎన్ని ప్రయత్నాలు చేసినాసరే, ఈ పోరాటాలు లేకుండా కార్మికుల జీవిత పః స్థితిని బాగుచేయడం అసంభవమని తెలియజేయాలి. పోరా టానికి కమ్యూనిస్టులు సర్వసంసిద్ధంగా ఉన్నారని, కార్మిః సంఘాల్లోను పారిశ్రామిక సంఘాల్లోను ఉన్న కమ్యూనిస్ట ప్రాక్షనులు. నిరంతరం తెలియజేయాలి. పోరాటం తప్పించః రాదనితమఅనుచరులకు విస్పష్టం చేయాలి. ఇట్టిపరిస్థితిలో వచ్చే ఉద్యమాలనుపోరాటాలను ఐక్యపరచడం ప్రధాన బాధ్యతగ ఉండాలి. పోరాటములో ప్రవేశించినట్టి పరిశ్రమల్లోని, వృత్తి ల్లోని సెల్లులు, ఫ్రాక్షనులుపరస్పరసన్నిహిత సంబంధం నిలబెట్టు కోవాలి. అంతేగాదు. వచ్చే ఉద్యమాలన్నింటికి నాయకత్వ వహించాలి. పోరాటంలో పాల్గొంటున్న వారితో భుజంభుజః కలపి ఉద్యమాన్ని విస్తృతము, తీవ్రము, వ్యాప్తము చేయగః గిన నాయకులను, బాధ్యతగల కామ్రేడ్సును, జిల్లాకమిటీలు కేంద్రకమిటీలు త్వరగా పంపాలి. ఈ పోరాటాల ఐక్య స్వభ వాన్ని ప్రతిచోటా ఎత్తిచూపడం పార్టీ ముఖ్య బాధ్యత తద్వారా అవుసరమయితే, రాజకీయ విధానంద్వార సమస్యాపరిష్కార విధానాన్ని అభిప్రాయాన్నిఅభివృద్ధిచేయాలి పోరాటాలు తీవ్రము, వ్యాప్తము అయినప్పుడు, ఈ పోరాట లకు నాయకత్వం వహించడానికి ఒకేవిధమైన సంస్థలను నిర్మిః చడం అవుసరం. నిరంకుశ సమ్మెనాయకులు అపజయః పొందిన ప్రతిచోటా కమ్యూనిస్టులు వెంటనే ముందుక రావాలి. ఖచ్చితమైన పోరాటనిర్మాణాన్ని - సామాన్యమైః

ప్రాథమిక నిర్మాణాన్ని ఏర్పరచాలి. సామర్థ్యంగల మిలిటరీ నాయకత్వంక్రింద. ప్రాక్షను సమావేశాల్లోను పారిశ్రామిక కమ్యూనిస్టుల్లోను, వాటికిసంబంధించిన పరిశ్రమల సభల్లోను నిరంతరం దీని అవసరాన్నిగూర్చి తెలియచేయడంవల్ల దీనిని సాధించవచ్చు.

ఉద్యమము వ్యాప్తమయినకొద్దీ, యజమానులసంఘాల దాడి, ప్రభుత్వజోక్యములవల్ల ఉద్యమము రాజకీయ స్వభావాన్ని తీసుకుంటుంది. అప్పుడు కార్మికకమ్యూనిస్ట్ల ఎన్నికల గూర్చి ప్రచారము, నిర్మాణము ప్రారంభించాలి. ఇది సాధ్యమేగాకుండా, అవసరంకూడా కావచ్చు.

కార్మికవర్గము తన పోరాటఆయుధాలకు పదును పెట్టడంద్వారానే తన విముక్తి సాధించగలదని పార్టీసంస్థలన్నీ ఇట్టిపరిస్థితుల్లో ఖచ్చితంగా తెలియజేయాలి. ఈ ప్రచారంలో కార్మికనిరంకుశ నాయకులనుగూర్చిగాని, సోషలిస్టు నాయకులనుగూర్చిగాని, ఏమాత్రం వెనుకాడరాదు.

35. ఇప్పటికే అభివృద్ధిఅయిన కమ్యూనిస్టుపార్టీలు ముఖ్యంగా పెద్దప్రజాపార్టీలుగా అభివృద్ధిఅయిన కమ్యూనిస్టుపార్టీలు, ప్రజాకార్యచరణకు సాయుధమై ఉండాలి. రాజకీయ ప్రదర్శనాలు, ఆర్థికప్రజా ఉద్యమాలు, స్థానికపోరాటాలు, వీటన్నింటిలో వచ్చిన అనుభవాన్ని నిర్మాణపరచుకోవాలి. తద్వారా విశాలమైన ప్రజానీకంతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకోవాలి. పెద్ద ఉద్యమాల్లో వచ్చిన అనుభవాన్ని, పార్టీనాయకుల, బాధ్యతగల పార్టీవర్కర్ల, పెద్ద,మధ్యతరగతిపరిశ్రమల్లోని నమ్మకమైనకార్మికప్రతినిధుల సంయుక్త సభల్లో చర్చించుకోవాలి. ఇందువల్ల పరస్పర సంబంధాలు

వలలాగా అల్లుకుపోయి నిరంతరం అభివృద్ధి అవుతాయి. బల పడుతాయి. పరిశ్రమల్లోని కార్మికప్రతినిధుల పోరాటతత్వం పెరుగుతుంది. కార్మిక (షాపు) ప్రతినిధులతో పార్టీనాయకులకు బాధ్యతగల పార్టీవర్కర్లకు పరస్పర నమ్మకము ఏర్పడడమే పార్టీబలానికి, పరిస్థితులకు అన్వయించని అపరిపక్వ పోరాటాలు చేయకుండా ఉండటానికిహామీ.

పెద్ద ప్రజాపోరాటాల్లో పాల్గొంటున్న కార్మికవర్గము నకు పార్టీయంత్రాంగానికిమధ్య సన్నిహితసంబంధం నిర్మించకుండా నిజమైన విప్లవోద్యమాన్ని అభివృద్ధిచేయడం జరుగదు. ఇట లీలో గతసంవత్సరం విప్లవవెల్లువలో కార్మికులు ఫ్యాక్టరీలను వశపరచుకున్నారు. కాని ఈ విప్లవవెల్లువ అచిరకాలము లోనే అంతమయింది. రాజకీయనాయకుల విద్రోహధోరణి, కార్మిక నిరంకుశనాయకులూ ఇందుకు ఎక్కువగా కారణం అనేదినిజమే. రాజకీయంగా అభివృద్ధిఅయి, పార్టీభవిష్యత్తును అభిలషించే కార్మిక (షాపు) ప్రతినిధులద్వారా పార్టీకి పరిశ్రమలకు మధ్య సన్నిహిత సంబంధం లేకపోవడంకూడా ఇందుకు కొంత కారణం. ఈ లోపమువల్లనే ఈ సంవత్సరం (1921) యింగ్లాండులోని బొగ్గుగని పనివారలసమ్మె చాలా నష్టపోయింది.

## 7 పార్టీ పత్రిక

36. పార్టీ తన సర్వశక్తులు వినియోగించి పత్రికను అభివృద్ధిచేయాలి. పార్టీ సలహాలను ఆచరించని యేపత్రికనూ పార్టీ పత్రికగా పరిగణించరాదు.

ఎక్కువ పత్రికలను నడిపేదానికంటే మంచి పత్రికలను నడపడంలో పార్టీ శ్రద్ధవహించాలి. ప్రతి కమ్యూనిస్టు పార్టీకి ఒక మంచి కేంద్రపత్రిక — అవకాశముంటే దినపత్రిక వుండాలి.

బూర్జువాపత్రికలు, సామాన్యంగా సోషలిస్టు పత్రికలు కూడా పెట్టుబడిదార్ల ధనంతో నడుపబడతాయి. కమ్యూనిస్టు పత్రిక అలా పెట్టుబడిదారీ సంస్థగా ఉండరాదు. పెట్టుబడి సంస్థలనుంచి మన పత్రిక స్వతంత్రంగా ఉండాలి; పెట్టుబద్ధంగా పనిచేస్తున్న మన పెద్దపార్టీల పత్రికలకు అడ్వర్టైజుమెంటులు, నిర్మాణం చేసుకోవడం అవసరమవుతుంది. కాని ఇందుమూలంగా పెద్ద అడ్వర్టైజుమెంటులమీద ఆధారపడి పత్రిక నడుపరాదు. కార్మికుల సాంఘిక సమస్యలమీద పత్రిక అవలంబించే దృక్పథంవల్ల మన అన్ని ప్రజాపార్టీల్లోనూ దాని పలుకుబడి పెరుగుతుంది.

ప్రజా సామాన్యానికి కాలంవెళ్ళబుచ్చే పత్రికగా గాని, విచిత్ర వార్తలను ప్రకటించి సర్దా తీర్చేపత్రికగాగాని మన పత్రిక ఉండరాదు. 'గౌరవనీయమైన' పత్రికగా ఉండాలని ప్రయత్నించడంలో పెటీబూర్జువా విమర్శలకుగాని, పత్రికా ప్రముఖుల విమర్శలకుగాని లొంగిపోరాదు.

33. అణచబడి పోరాడుతున్న కార్మికుల హక్కులను గూర్చి పత్రిక ముఖ్యంగా శ్రద్ధవహించాలి. కార్మిక విప్లవానికి పత్రిక మనకు మంచి ఆందోళనా పరుడుగాను, నాయకత్వం వహించే ప్రచారకుడుగాను ఉండాలి.

పార్టీ మెంబర్ల పనిద్వారా వచ్చిన విలువైన అనుభవాలను పత్రిక సేకరించాలి. కమ్యూనిస్టు కార్యక్రమవిధానా

లను నిరంతరం అభివృద్ధి చేసుకోడానికి వీటిని ప్రచురించాలి. ఈవిధంగా మనవిప్లవ కార్యక్రమానికి మంచి నిర్మాతగా పని చేయ గలదు.

పార్టీ పత్రికయొక్క సర్వవ్యాపిత నిర్మాణపనిద్వారా ఈ ఆశయముకొరకు పత్రిక పనిచేయడంద్వారానే, మనం కేంద్రీకృత ప్రజాస్వామ్యమును నిర్మించగలము. పార్టీలో పని విభజన సక్రమంగా చేయగలము. ఈవిధంగా పత్రిక తన చారిత్రాత్మక బాధ్యతను నెరవేర్చేలా చేయగలము.

39. కమ్యూనిస్టుసంస్థ (lender takink) అవడానికి కమ్యూనిస్టుపత్రిక ప్రయత్నించాలి. అనగా, అది కార్మికుల పోరాటసంస్థగాను, విప్లవ కార్మికుల, పత్రికకు రెగ్యులరుగా వ్యాసాలు పంపేవారియొక్క సంపాదకుల, కంపోజిటర్ల, అచ్చువేసేవారి, పంపకంచేసేవారి, స్థానిక విషయాలను సేకరించి పత్రికకు పంపేవారి, పత్రికనుగూర్చి రోజూప్రచారం చేసేవారి సమిష్టిసంస్థ (working community) గా ఉండాలి. పత్రికను నిజమైన పోరాట ఆయుధంగాను కమ్యూనిస్టుల సమిష్టిసంస్థగాను తయారు చేయాలంటే చాలా ప్రాక్టికలు నియమాలు ఆచరణలోకి తీసుకరావాలి.

పత్రికతో కమ్యూనిస్టు సన్నిహిత సంబంధం కలిగియుండాలి. దానికొరకు పనిచేయాలి, త్యాగంచేయాలి. అది అతని నిత్యఆయుధము; ఉపయోగానికి అనుకూలంగా ఉండాలంటే, దానికి రోజూ పదును పెడుతూ ఉండాలి. కమ్యూనిస్టు పత్రికను నిలబెట్టడానికి అత్యధిక త్యాగాలు చేయాలి. మొదటి దశలో పత్రికను అభివృద్ధి చేయడం, బాగుచేయడం

పార్టీ సాధారణ సభ్యులనుంచే సేకరించాలి. పత్రిక బలపడి పెరిగినపుడు పార్టీ విశాలంగా వ్యాప్తమయినపుడు, కమ్యూనిస్టు ఉద్యమానికి పెద్ద అండగా తయారవుతుంది.

పత్రికనుగూర్చి తీవ్రంగా ప్రచారంచేస్తే చాలదు. దానికి వ్యాసాలుకూడా పంపాలి.

కర్మాగారాల్లోని చిన్న ప్రమాదాలనుంచి కార్మికుల సభలవరకూ కార్మికునియెడలఅసభ్యంగా ప్రవర్తించడంనుంచి ఆసంస్థ ఆర్థికరిపోర్టువరకు- కర్మాగారాల్లో జరుగుతున్నట్టి, ఆర్థికంగాగాని, సాంఘికంగాగాని ప్రాముఖ్యతఉన్న అన్ని ఘటనలను పత్రికకు వెంటనే రిపోర్టుచేయాలి. కార్మికసంఘాల ముఖ్యమైన అన్నినిర్ణయాలు, తీర్మానాలు, శత్రువులముఖ్య చర్యలనుగూర్చి కార్మిక సంఘాల్లోని ప్రాక్షనులు రిపోర్టు చేయాలి. బజారుల్లోను, సభల్లోను శ్రద్ధగాపరిశీలిస్తున్న పార్టీ మెంబర్లు పౌరజీవితాన్ని చిత్రించుతూ విమర్శనలు పంపాలి. వీటిని మన పత్రికల్లో ప్రకటించినపుడు, ప్రజల నిత్యజీవిత విషయాలను గూర్చికూడా మనం ఎలాపనిచేస్తున్నదీ మన మీద సానుభూతిలేని చదువరులకు రుజువుచేస్తాయి.

కార్మికుల జీవితాలు, కార్మికసంఘాలనుంచి వచ్చే వార్తలను ప్రకటించడంలో సంపాదక వర్గము ప్రత్యేక శ్రద్ధ వహించాలి; మన పత్రికకు, కార్మికుల జీవితానికి సన్నిహిత సంబంధంఉందనే అభిప్రాయాన్ని కలుగ జేయడానికి వీటిని ఉపయోగించాలి. లేదా కార్మికుల నిత్యజీవితవిషయాలను ఉదాహరణగా తీసుకుని కమ్యూనిస్టు సిద్ధాంతాలను విపులీకరించడానికి ఉపయోగించవచ్చు. అవకాశమున్నపుడు

దినములో అనువైనకాలాన్ని సంపాదకవర్గము ప్రత్యేకించాలి. ఈ కాలములో కార్మికులువచ్చి వారిఉద్దేశములో పార్టీ అభివృద్ధికిగాను అవసరమనుకుని చెప్పదలచుకునే తమకోర్కెలు, జీవితములోని కష్టాలు మొదలయినవాటిని సంపాదక వర్గము వినడానికి సిద్ధంగాఉండాలి.

పెట్టుబడిదారీ విధానం మూలంగా మనపత్రిక కమ్యూనిస్టు వర్కర్ల సమిష్టి సంస్థగా సంపూర్ణంగా తయారవడము అసంభవము అనేది సత్యమే. అయినప్పటికిన్ని మహా కష్ట పరిస్థితుల్లోకూడా ఇట్టి విప్లవ పత్రిక నిర్మాణములో కొంత విజయం సాధించవచ్చు. 1912–13 సంవత్సరాల కాలములో రష్యను కామ్రేడ్సు 'ప్రవదా' పత్రిక విషయంలో ఇది రుజువు చేశారు. ముఖ్యకేంద్రాల చైతన్యవంతులయిన విప్లవ కార్మికుల పర్మనెంటు సంస్థకు అది ప్రాతినిధ్యం వహించింది. పత్రిక విషయాలు సేకరించడంలోను, ప్రకటించడంలోను, పత్రిక పంచడంలోను ఆ కామ్రేడ్సు తమ సమిష్టిశక్తులను వినియోగించారు. ఇందులో చాలామంది తమ యితర పనులు చేసుకుంటూనే ఈపని నిర్వర్తించారు; ఆ సంపాదనలో కొంతభాగాన్ని పత్రిక అవసరాలకై వినియోగించారు. వారు కోరుతున్న ముఖ్యవిషయాలు, అప్పటి ఉద్యమానికి అవసరమైన ప్రముఖవిషయాలు, వారి కార్యక్రమము పోరాటములో యిప్పటికీ ఉపయోగించుకోదగిన విషయాలను పత్రిక ప్రకటించేది. పార్టీ మెంబర్లు, విప్లవ కార్మికులు ఇట్టి పత్రికను నిజమైన 'మన పత్రిక'గా గుర్తించాలి.

40. పార్టీ నడుపుతున్న కాంపెయినుల్లో నేరుగా పాల్గొనడమే కమ్యూనిస్టు పత్రికకు ముఖ్యవిషయంగా

ఉండాలి. పార్టీ శక్తులన్నీ ఒక కాంపెయినులో కేంద్రీకరించి పనిచేస్తున్నప్పుడు, సంపాదకీయాలు మాత్రమేగాక ఈ కాంపెయినుకై పత్రిక అన్నిడిపార్టుమెంటులు పనిచేయాలి. ఈ కాంపెయినుకు అవసరమయిన విషయాలను సంపాదకవర్గము సేకరించాలి. పత్రిక అంతా ఈవిషయాలతో నింపాలి.

41. నిర్మాణయుతంగా "మన పత్రికకు" చందాదారులను సంపాదించాలి. కార్మికులను ఉద్రిక్త పరచే ప్రతి అవకాశాన్ని, కార్మికుల రాజకీయ సాంఘిక చైతన్యాన్ని రేకెత్తించే ప్రతి ప్రత్యేక ఘటనను ఉపయోగించుకోవడం మొట్టమొదటివిషయం. కార్మికుల హక్కులకై బహిరంగంగాను గట్టిగాను పత్రిక నిలబడి, ప్రతి పెద్ద సమ్మెలోను, ఫ్యాక్టరీలు మూసివేయడం (lock out) లోను పత్రికకు చందాదారులకై కార్మికుల్లో ప్రచారంచేయాలి. కమ్యూనిస్టులు పనిచేస్తున్న పరిశ్రమల్లోను, సమ్మెలో పాల్గొన్న పరిశ్రమల్లోని కార్మిక సంఘాల బ్రాక్షన్లలోను, చందాదారుల లిస్టులు, చందాదారుల రసీదు పుస్తకాలు పంచాలి. అంతేకాదు, పార్టీ పత్రికకై ప్రచారము చేస్తున్న ప్రత్యేక గ్రూపులద్వారా చందాదారుల రసీదులను యింటింటికీ పంచాలి.

అదేవిధంగా కార్మికులను చైతన్యవంతులను చేసిన ప్రతి ఎన్నికల కాంపెయినులోను ప్రత్యేకదళాలను ఏర్పాటు చేయాలి. ఈ దళాలు కార్మికుల యిండ్లకువెళ్లి కార్మికుల పత్రికను గూర్చి చక్కగా ప్రచారంచేయాలి.

అంతర్గతంగా రాజకీయ, ఆర్థిక క్లేశము ఉన్నపుడు నిరుద్యోగము, ధరలు పెరగడం, మొదలయిన కష్టాలద్వారా అది ప్రదర్శితమవుతుంది. ఇట్టి పరిస్థితుల్లో వివిధపరిశ్రమల్లో

నిర్మాణపరచబడిన కార్మికులను మనవైపు త్రిప్పుకోడానికి సర్వప్రయత్నాలు చేయాలి. పత్రికపై ప్రచారంజేయడానికి వీరిని గ్రూపులుగా నిర్మాణపరచాలి. చందాదారులను సంపాదించడానికి నెలలో చివరివారము మంచి అనువైన కాలమని అనుభవంద్వారా రుజువుఅవుతున్నది. పత్రికకై ప్రచారం జరుపకుండా ఒక్క చివరి వారానైనా పోగొట్టారంటే, కమ్యూనిస్టు ఉద్యమాన్ని వ్యాప్తముచేసే విషయంలో పెద్ద తప్పు చేశారన్నమాట. ప్రతి బహిరంగసభ, ప్రదర్శనాల, ఆది మధ్య, అంతంలోను పత్రికా ప్రచారకదళాలు చందా దారుల లిస్టులతో సిద్ధంగాఉండాలి. యూనియనుసభల్లోను, షాపుసమావేశాల్లోను ఆయా బ్రాంచీలుకూడా ఈ బాధ్యతలను నిర్వహించాలి.

42. ప్రతిపార్టీసభ్యుడు మనపత్రికను సమర్థించాలి. పెట్టుబడిదారుల పత్రికలకు వ్యతిరేకంగా తీవ్రంగా ప్రచారం చేయాలి. ఈ పత్రికలు, సత్యాన్ని మరుగుపరచడం, అసత్యాలు, నీచవార్తలు ప్రకటించడం అవి అవలంబించే ద్వంద్వ విధానములను బహిరంగపర్చాలి.

స్వతంత్ర పత్రికలను, సోషలుడెమోక్రాటిక పత్రికలను తీవ్రంగా నిరంతరం విమర్శించాలి. ఈ విమర్శ ముతాదారీ తత్వముతో చేసే విమర్శనకు దిగకుండా రోజు రోజు వస్తున్న వర్గపోరాటాలను వారు ఎలామరుగు పరుస్తున్నారో బహిరంగపరచాలి. ఈ సోషలుడెమోక్రాటిక పత్రికలపలుకుబడిలోనుంచి కార్మికులను బయటకు తీయడానికి, కార్మిక సంఘాల తదితర బ్రాంచీలు నిర్మాణయుతంగా పనిచేయాలి.

పత్రికకొరకు ఇంటింటికితిరిగి ప్రచారం చేస్తున్నపుడు,
ష్యంగా పారిశ్రామిక కార్మికుల యిండ్లల్లో ప్రచారం
న్నపుడు సోషలుడెమోక్రాటికు పత్రికలకు వ్యతిరేకంగా
ప్రచారంకూడా జోడించాలి.

## 7 పార్టీ యంత్రము

43. భౌగోళిక విభజన స్కీముమీదనే పార్టీ
ర్మాణము అభివృద్ధిచేయరాదు. జిల్లాలోని ఆర్థిక, రాజకీయ
శాపరిస్థితులనుబట్టి చేయాలి. పెద్ద పారిశ్రామిక
ద్రాలు, ముఖ్యపట్టణాలు పార్టీ కార్యక్రమానికి ప్రధాన
ద్రాలుగా ఉండాలి.

నూతన పార్టీనినిర్మించుతున్నపుడు, దేశమంతాఒక్క
గా పార్టీనిర్మాణమును వ్యాప్తము చేయాలనే ధోరణి
సామాన్యంగా వస్తుంది. పార్టీ చేతుల్లో కొద్దిమంది వర్కర్లు
మాత్రమే వున్నారనేది విస్మరించి ఈ కొద్దిమందిని నలు
లకుపంచివేస్తారు. పార్టీఅభివృద్ధిని ఇదిబలహీన పరుస్తుంది.
ధంగా పనిచేయడంవల్ల పార్టీ ఆఫీసులు ప్రతిచోటా
లుదేరుతాయిగాని ముఖ్య పారిశ్రామిక పట్టణాల్లో
నా బలపడడమనేది జరగదు.

44. పార్టీని అనేక గ్రూపులుగా విభజించి, ఒకదాని
కు ఒకటిగా అనేకమెట్లుగా నిర్మించి; పార్టీ కార్యక్ర
న్ని కేంద్రీకరింపజేయడం మంచిదిగాదు. రాజకీయంగాను,
కంగాను లేదా రవాణాలోను కేంద్రంగానున్న ముఖ్య
ణాలను కేంద్రాలుగా తీసుకోవాలి. అక్కడినుంచి ఆ
ర ప్రాంతాల్లోను, దగ్గరగానున్న రాజకీయ ఆర్థిక జిల్లా

ల్లోను వ్యాప్తమవ్వాలి. వలలాగా నిర్మాణముఅల్లుకుపోవాలి. జిల్లాలోని జనరల్ బాడీకి పెద్దకేంద్రంలోనిపార్టీ కమిటీనాయకత్వంవహించాలి. జిల్లాలోని పార్టీనిర్మాణ కార్యక్రమమునడపాలి. స్థానికంగా ఉన్న సభ్యులతో సన్నిహిత సంబంధం పెట్టుకుని పార్టీ విధానాన్ని ఆచరణలో పెట్టాలి.

జిల్లా కాన్ఫరెన్సుల్లో ఇట్టి జిల్లాలకు ఆర్గనైజర్లను ఎన్నుకోవాలి. వీరిని కేంద్రకమిటీ ఆమోదించాలి. స్థానిక పార్టీ నిర్మాణములో పేరు తీవ్రంగా పాల్గొనాలి. స్థానికంగా పనిచేస్తున్న పార్టీవర్కర్లను జిల్లాకమిటీలోకి తీసికుంటూ వుండాలి. జిల్లాకమిటీకి, జిల్లాలోని ప్రజలకు సన్నిహితసంబంధాలు తద్వారా ఏర్పడుతాయి. పార్టీ అభివృద్ధిఅవుతున్న కొద్దీ జిల్లాలో నాయకత్వం వహించుతున్న కమిటీ, ఆ ప్రాంత రాజకీయనాయకత్వం వహించేసంస్థగా అభివృద్ధిగావడానికి కృషిచేయాలి. ఈవిధంగా కేంద్రకమిటీ, జిల్లాకమిటీలు యావత్తు పార్టీయంత్రములో నాయకత్వపాత్ర నిర్వహించాలి.

పార్టీ జిల్లాల సరిహద్దులు ఆప్రాంతవైశాల్యాన్ని బట్టి నిర్ణయించ నవసరంలేదు. తన క్రిందనున్న అన్ని కమిటీలను జిల్లాకమిటీ ఒకే విధానంతోనడువగలదా అనేదే ప్రధానంగా తీసికోవాలి. ఇది అసంభవమయినపుడు జిల్లాను విభజించి నూతనపార్టీ జిల్లాలను ఏర్పరచాలి.

పెద్దదేశాల్లో కేంద్రకమిటీకి, స్థానికకమిటీకి మధ్య ఇంకొక్క కమిటీని ఏర్పరచవలసిన అవసరంకూడా ఉన్నది. మధ్యస్థంగాఉన్న ఈ కమిటీలకు, ఉదాహరణకు ఎక్కువ సభ్యత్వంగల పెద్దనగరంలోని కమిటీకి, నాయకత్వ పాత్ర ఈయడం కొన్నిప్రత్యేక పరిసితులలో మంచిదే. గాని ఇది

వికేంద్రీకరణకు దారితీస్తుంది గాబట్టి దీనిని సామాన్యంగా ఆచరణలోకి తీసుకురాదు.

45. చిన్నపట్టణాల్లోను, జిల్లాల్లోను, నగరంలో వివిధప్రాంతములలోను ఉన్న పార్టీ గ్రూపులనుంచి పెద్దదయిన మధ్యస్థకమిటీ ఏర్పరచాలి.

చట్టబద్ధంగానే ఉండి, సభ్యుల అందరి జనరలుబాడీ సమావేశాలు జరపడం అసంభమయేటంతగా ఏ స్థానిక కమిటీఅయినా అభివృద్ధి చెందినపుడు దానిని విభజించాలి.

పార్టీ రోజువారీ కార్యక్రమము జరుపడానికి సభ్యులను గ్రూపులుగా విభజించాలి, పెద్దపార్టీగాఉన్నపుడు దానిలోని కొన్ని గ్రూపులను సమిష్టిబాడీలుగా మార్చడం మంచిది కావచ్చు. పార్టీయొక్క తమ నిత్యకార్యక్రమంలో వీరు ఒకరి నొకరు కలుసుకోడానికి అవకాశము ఉండేలాగునే విభజన చేయాలి చిన్నగ్రూపులకు పని విభజన చేయడం, వాటి నాయకులనుంచి రిపోర్టులు తెప్పించుకోవడం, కాండిడేట్లను సభ్యులుగా తర్ఫీదుచేయడం, ఇవేసమిష్టి గ్రూపు లక్ష్యాలు.

46. కమ్యూనిస్టు ఇంటర్నేషనలు నాయకత్వాకిందిన పార్టీ అంతా పనిచేయాలి. అనుబంధపార్టీల విధానాలగూర్చి ఇంటర్నేషనలు కార్యవర్గం (execution) యిచ్చే సూచనలను, తీర్మానాలను (1) పార్టీ కేంద్రకమిటీకి లేదా (2) కేంద్ర కమిటీద్వారా ప్రత్యేక కమిటీలకు లేదా (3) పార్టీసభ్యులందరకు అందచేయవచ్చు

ఇంటర్నేషనలు చేసే తీర్మానాలకు సూచనలకు పార్టీ, పార్టీ ప్రతిసభ్యుడూ కట్టుబడి యుండాలి.

47. పార్టీ కాంగ్రెసులో పార్టీ కేంద్రకమిటీని ఎన్నుకోవాలి. రాజకీయనిర్వహణకుగాను రెండు సబ్ కమిటీలుగల ఒకచిన్న బాడీని కేంద్రకమిటీ సభ్యులనుంచి, కేంద్రకమిటీ ఎన్నుకోవాలి. పార్టీ రాజకీయ కార్యక్రమానికి, రోజువారీ పనికి ఈ రెండు సబ్ కమిటీలు బాధ్యత వహించాలి. ఈ సబ్ కమిటీలు కేంద్రకమిటీ సమావేశాలను ఏర్పాటులు చేయాలి. ఈసమావేశాల్లో తక్షణ ప్రాముఖ్యత గల విషయాలమీద నిర్ణయాలు తీసుకోవాలి. రాజకీయ పరిస్థితిని పరిశీలించడానికి, పార్టీలోఉన్న పరిస్థితిని అవగాహన చేసుకోడానికి, పార్టీయావత్తు జీవితానికి సంబంధించేనిర్ణయాలు తీసుకునేపుడు, కేంద్ర కమిటీలో వివిధప్రాంతాల ప్రతినిధులు ఉండటం అవుసరం. ఈ కారణంతోనే, ఎత్తుగడలకు సంబంధించిన భేదాభిప్రాయాలు, ఇవి తీవ్రంగాఉన్నపుడు, కేంద్ర కమిటీ వీటిని అణచివేయరాదు. పైగా కేంద్రకమిటీలో ఈ అభిప్రాయాలకు కూడా ప్రాతినిధ్యం ఉండాలి. కాని చిన్న కమిటీలో (పొలిట్‌బ్యూరో) ఐక్యాభిప్రాయాలు గలవారే ఉండాలి.ఖచ్చితమైన పంథాఅవలంబించడానికి పొలిట్‌బ్యూరో తన బలముమీద, కేంద్ర కమిటీలో మెజార్టీమీద ఆధార పడాలి.

ఈ విధంగా కేంద్రకమిటీని నిర్మాణం చేసినపుడు, ముఖ్యంగా చట్టబద్ధంగా పనిచేస్తున్న పార్టీలో ఇలానిర్మాణం చేసినపుడు, పార్టీడిసిప్లినుకు కొద్ది కాలములోనే బలమైన పునాది ఏర్పడుతుంది. కేంద్రకమిటీ పార్టీసభ్యుల నమ్మకాన్ని చూరగొంటుంది. పార్టీలో ప్రదర్శితమయ్యే ఊగిసలాటలను

లను. తప్పుడుపోకడలను పార్టీ కాంగ్రెసువరకూ రాకుండానే తొలగించవచ్చు.

48. వివిధశాఖల పనిలో నైపుణ్యం సంపాదించడానికి ప్రతికమిటీ తన సభ్యులమధ్య పని విభజించుకోవాలి. ఇందుకుగాను, ప్రచారక కమిటీ, కార్మికసంఘ కమిటీ, సంపాదకవర్గ కమిటీ మొదలయిన ప్రత్యేక కమిటీలు ఏర్పరచడం అవసరం కావచ్చు. ప్రతి ప్రత్యేక కమిటీ జిల్లాకమిటీకిగాని, కేంద్ర కమిటీకిగాని లోబడిఉండాలి.

అన్ని కమిటీలను ఏర్పరచడము, వాటిమీద అధికారం ఆ జిల్లా కమిటీల చేతుల్లో ఉండాలి. చివరిమెట్టులో కేంద్ర కమిటీ చేతుల్లో ఉండాలి. సంపాదకులు, ఆర్గనైజర్లు, ప్రచారకులు మొదలయినవారి పనిని అప్పుడప్పుడూ మార్చుతూ ఉండడం మంచిది; కాని ఇది పార్టీపనికి ఎక్కువగా అడ్డు తగులకుండా ఉండాలి. ప్రచారకులు, సంపాదకులు ఏదో ఒక గ్రూపులోఉండి, పార్టీ నిత్యకార్యక్రమంలో పాల్గొనాలి.

49. అన్ని కమ్యూనిస్టు సంస్థలనుంచి, గ్రూపులనుంచి మెంబర్లనుంచి ఎప్పుడుబడితే అప్పుడు పూర్తిరిపోర్టులు తీసికోడానికి కేంద్రకమిటీకిన్ని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కున్ను అధికారం ఉన్నది. కేంద్ర కమిటీసభ్యులు, వారిచేనియమించబడినవారు అన్నిసమావేశాల్లోను పాల్గొనడానికి హక్కున్నది. వారిదే అంత్యనిర్ణయం. సెంట్రల్ కమిటీ క్రింద ఎల్లప్పుడూ ప్లెనిపొటెన్షియర్లు ఉండాలి. (అనగా వివిధజిల్లా, ప్రాంతాల నాయకత్వ కమిటీలను రాజకీయ, నిర్మాణ సమస్యలగూర్చి, ఉత్తరాలు, సర్క్యులరులద్వారానే గాకుండా, నేరుగాను ముఖతాను సూచనలు ఇచ్చి స్పష్టీకరించే కమిసార్లు.)

పార్టీ ప్రతిసంస్థకు, ప్రతిశాఖకు, ప్రతిసభ్యునకు నేరుగా కేంద్రకమిటీకిగాని, ఇంటర్నేషనలుకుగాని ఏ కాలములో నయినా, తమ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు, కంప్లైయింటులు పంపుకునే అధికారమున్నది.

50. పై కమిటీల సలహాలకు, నిర్ణయాలకు క్రింద కమిటీలు, సభ్యులు బద్ధులయిఉండాలి. పై కమిటీల బాధ్యతలు, అవి తమ అధికారాన్ని దుర్వినియోగం చేయకుండాను, పని ఎగవేయకుండాను పై కమిటీల బాధ్యతలు నామమాత్రంగా కొంతవరకు మాత్రమే నిర్ణయించడానికి వీలుంటుంది. వాటి నామమాత్ర బాధ్యత ఎంత తక్కువగావుంటే (ఉదాహరణకు రహస్యపార్టీల్లో) పార్టీసభ్యులఅభిప్రాయాలనుపరిశీలించడంలోను పూర్తి సమాచారము సేకరించడంలోను, సంపూర్తిగా ఆలోచించిన తర్వాతనే తమనిర్ణయములు చేసుకోవడంలోను బాధ్యత (ఆబ్లిగేషను) అంత ఎక్కువగా ఉంటుంది.

51. పార్టీసభ్యులు మిలిటెంటు సంస్థల్లో డిసిప్లిను అలవరచుకున్న సభ్యులుగా తమ కార్యకలాపాల్లో పనిచేయాలి. పనివిధానములో భేదాభిప్రాయాలు వచ్చినపుడు, అవకాశమున్నంతవరకు అంతకు పూర్వమే పార్టీలోపల చర్చల్లో నిర్ణయించుకోవాలి. ఈ నిర్ణయాలను అనుసరించి పనిచేయాలి. పార్టీనిర్ణయము తప్పని మిగిలిన సభ్యులు అభిప్రాయపడినప్పుడు గాని పార్టీసమిష్టి సంఘటన ఐక్యతను భగ్నంచేయడం గాని, అడ్డుకోవడం గాని, మిలిటరీగా పెద్దతప్పని, డిసిప్లిను లేనిచర్యల నికృష్టరూపమని; తమ బహిరంగ కార్యకలాపాలన్నింటిలోనూ ఈ సభ్యులు విస్మరించరాదు.

పార్టీ శత్రువులనుంచి కమ్యూనిస్టు పార్టీని, కమ్యూనిస్టు ఇంటర్నేషనలును రక్షించడం ప్రతి సభ్యుని ముఖ్యకర్తవ్యం. ఇది మరచిపోయి పార్టీని, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ను బహిరంగంగా దూషించేవాడు, పార్టీ విద్రోహి.

52. పార్టీ సంస్థలను కమ్యూనిస్టు విధానంలో అభివృద్ధి చేయడానికి, పార్టీ కార్యక్రమాన్ని నిరంతరం అభివృద్ధి చేయడానికి (అడ్డు తగలడానికి కాకుండా), పార్టీ కమిటీలకు సహాయపడేలాగున పార్టీ నిబంధనావళిని ఏర్పరుచుకోవాలి. కమ్యూనిస్టు ఇంటర్నేషనలు నిర్ణయాలను అన్ని అనుబంధ పార్టీలు, పార్టీ నిబంధనలు, నిర్ణయాలు ఇందుకు అనుగుణంగా లేకపోయినా వెంటనే ఆచరణలో పెట్టాలి. నిబంధనావళిని తర్వాత మార్చుకోవచ్చు. అంతవరకు ఆచరణలో పెట్టడం ఆపరాదు.

# 8 బహిరంగ, రహస్యకార్యక్రమము

53. పోరాటపరిస్థితిలో వచ్చేమార్పులకు అనుగుణంగా వెంటనే మార్చుకోగలిగినట్టుగా పార్టీ నిర్మాణము ఉండాలి. తమకంటే అత్యధిక శత్రుబలాన్ని కేంద్రీకరించిన ఒక ప్రాంతంలో బహిరంగపోరాటంనుండి తప్పించుకోగల సామర్థ్యము ఉన్న మిలిటెంటు సంస్థగా పార్టీ అభివృద్ధికావాలి. కాని శత్రు కేంద్రీకరణను వినియోగించుకోవాలి. వాడు తలంచని అనుకోనిస్థలములో దెబ్బతీయాలి. పూర్తినిర్బంధ విధానము మీద మాత్రమే గాని తిరుగుబాటు, బహిరంగ పోరాటము మీదగాని పార్టీ తన సర్వస్వము ఒడ్డి పని చేయడం మహాపరాధం, శాంతి, విప్లవ దశల్లో ఎప్పుడు మార్పులు వస్తాయో

ముందుగానే తెలుసుకోగల్గడం ఇంచుమించుగా అసాధ్యం. కొన్ని పరిస్థితుల్లో ఇది తెలుసుకోవడం సాధ్యమయినప్పుడు కూడా, సర్వసామాన్యంగా మార్పు త్వరగాను, హఠాత్తుగాను, అనేకసార్లు వస్తుందిగాబట్టి, పునర్నిర్మాణం చేసుకోడానికి ఈ దూరదృష్టి చాలాసార్లు ఉపయోగపడదు. గాన ప్రతిపరిస్థితిలోను సిద్ధంగా ఉండాలనే ప్రాతిపదికపైన తమ ప్రాథమిక విప్లవకార్యక్రమాన్ని కమ్యూనిస్టులు సంపూర్తి చేసుకోవాలి.

54. సాయుధపోరాటానికి, లేదా రహస్యపోరాటానికి, సిద్ధపడి ఉండాల్సిన బాధ్యతయొక్క ప్రాముఖ్యతను పెట్టుబడిదారీ దేశాల్లోని కమ్యూనిస్టుపార్టీలు సామాన్యంగాగుర్తించవు. పార్టీ అస్తిత్వానికి ఎల్లకాలము లీగలు (చట్టబద్ధ) పునాదిపైన ఆధారపడడము చట్టబద్ధ కార్య అవసరాలకు తగినట్టుగా పని చేయడము తప్పు. లీగలు కమ్యూనిస్టుపార్టీలు ఈతప్పును సామాన్యంగా చేస్తాయి.

ఇక రహస్య పార్టీలు: విప్లవ ప్రజలతో నిరంతరం సంబంధం ఉండే పార్టీసౌధాన్ని నిర్మించడంలో చట్టబద్ధకార్యక్రమాల పూర్తి అవకాశాలను వినియోగించుకొనక తప్పు చేస్తాయి. ఈముఖ్య సత్యాన్ని త్రోసిపుచ్చే రహస్యపార్టీలు కుట్రదారుల గ్రూపులుగా తయారయి, ఫలితములేని కార్యాల్లో తమశక్తిని వృథా చేస్తాయి.

ఈరెండు ధోరణులూ తప్పే. రహస్యంగా పని చేయడానికి విప్లవ పోరాటాలకు, ప్రతిలీగలు పార్టీ సంసిద్ధంగా ఉండాలి. పార్టీ తీవ్రకార్య క్రమంద్వారా, విప్లవప్రజల యొక్క నిర్మాణమైన, నిజమైన నాయకుడుగా తయారవ

డానికిగాను, లీగలు కార్మికోద్యమ అవకాశాలన్నింటిని రహస్య పార్టీలు ఉపయోగించుకోవాలి.

55. పార్టీ నిర్మాణముతోను పార్టీ కార్యక్రమంతోను సంబంధంలేని, పూర్తి మిలిటరీ సంస్థగా పార్టీ నిర్మాణ రహస్య కార్యక్రమాన్ని అభివృద్ధి చేయాలనే ధోరణి రహస్యపార్టీల్లోను, లీగలు పార్టీల్లోను ఉన్నది. ఇదిపూర్తిగా తప్పు. కమ్యూనిస్టుపార్టీ సామాన్యకార్యక్రమం ద్వారానే విప్లవపూర్వదశలో మన మిలిటరీ సంస్థల నిర్మాణం చేయాలి. యావత్తు పార్టీని విప్లవానికి మిలిటరీసంస్థగా అభివృద్ధిచేయాలి.

విప్లవదశముందు, పరిస్థితులు పక్వము కాకుండానే అచ్చటచ్చటా నిర్మించిన విప్లవ మిలిటరీ సంస్థలకు ప్రత్యేకమైన, ఉపయోగ కరమైన కార్యక్రమం ఉండక పోవడంవల్ల విచ్ఛిన్నం అవుతుంటాయి.

56. పార్టీసంస్థలు, సభ్యులు అధికారులచేతుల్లో పడకుండా రహస్య పార్టీలు కాపాడుకోవాలి. విప్లవ సారస్వతము సేకరించడంలో అజాగ్రత్తవల్లను, పంపకంలో తెలివితక్కువ మొదలయిన వాటివల్లనుఅధికారులచేతుల్లోకి పోయేప్రమాదం రాకుండా చూచుకోవాలి. ఇందుమూలంగా లీగలుపార్టీలాగా రహస్యపార్టీనిర్మాణ పద్ధతులు ఉండజాలవు. అయినప్పటికిన్ని అనుభవంద్వారా ఈవిషయంలో నైపుణ్యాన్ని సంపాదించవలయును.

పోరాటదశకు, రహస్యంగా పనిచేయడానికి లీగలు ప్రజాపార్టీలు సర్వసిద్ధంగా ఉండాలి. ఎట్టి మార్పులకైనా సిద్ధంగా ఉండాలి. (ఉదా: సభ్యుల ఫైళ్లు దాచడానికి మంచి రహస్యస్థలాలు ఉండాలి. చాలా పరిస్థితుల్లో, ఉత్తరప్రత్యుత్త

రాలు తగులబెట్టేయాలి. వార్తాహారులను రహస్యంగా పని చేయడానికి తర్ఫీదు ఈయాలి.)

పూర్తి మిలిటరీ సంస్థలుగాను, పార్టీలోనే ఉన్నా పార్టీకి ఏమీ సంబంధం లేకుండా, పార్టీ రహస్యసంస్థలు ఉండాలని పాలీగలు పార్టీల్లోను, రహస్య పార్టీల్లోను అభిప్రాయాలున్నాయి. ఇది పూర్తిగా తప్పు. పార్టీ జనరలు కార్యక్రమముద్వారానే విప్లవ పూర్వదశలో మన పోరాట సంస్థలు నిర్మించాలి. విప్లవానికి యావత్తు పార్టీని పోరాట సంస్థగా తయారుచేయాలి.

57. విప్లవదశ ముందుకాలములోనే, విప్లవావసరాలకు అనుగుణ్యంగా ఉండేటటువంటి పోరాటసంస్థను ఏర్పరచి బలపరచడానికిగాను మనపార్టీ జనరలు కార్యక్రమం ఉండాలి.కమ్యూనిస్టుపార్టీ నాయకత్వము, విప్లవావసరములను గూర్చి అవకాశమున్నంత వరకూ ముందుగానే గ్రహించ గల్గి యుండాలి. వీటికి అనుగుణ్యంగానే నడవాలి. ఇది తేలికయినపనికాదు. కాని ఇందువల్ల కమ్యూనిస్టు నిర్మాణ నాయకత్వంలో ముఖ్యమైన ఈ విషయాన్ని వదలి వేయరాదు.

బహిరంగవిప్లవపోరాటాల కాలములోనాయకత్వంలో పెద్ద మార్పులు సంభవించినట్లయితే బాగా నిర్మాణమైన పార్టీకూడా చాలా క్లిష్టమయిన కష్టాలను ఎదుర్కొనవలసి వస్తుంది. విప్లవ పోరాటానికి కొద్దిరోజుల్లోనే తనశక్తులను సమీకరించవలసిన అవసరం ఏర్పడవచ్చు. పార్టీ శక్తులతో బాటు బహుశా, సానుభూతి సంస్థలనుకూడా ఉదా: (నిర్మాణ పరచని విప్లవ ప్రజలను), సమీకరించ వలసిరావచ్చు. రెగ్యు

లరు ఎర్రసైన్యాన్ని అప్పుడే నిర్మించ తలపెట్టనవుసరంలేదు. నిర్మాణపరచిన సైన్యంలేకుండానే పార్టీనాయకత్వం క్రింద నున్న విప్లవ ప్రజలతో మనం జయించగల్గాలి. గాన ఇట్టి పరిస్థితికి నిర్మాణమైన సన్నాహాలు చేసుకుని ఉండనట్లయితే, మిగతా ఎంతతీవ్రప్రయత్నమయినా విఫలమవుతుంది.

58. విప్లవ పరిస్థితికి సరిపోయినట్టుగా విప్లవము నడిపే కేంద్రకమిటీలు పనిచేయజాలక పోవడంజరుగుతున్నది. చిన్నపనులకు సంబధించినంతవరకు కార్మికవర్గము సామాన్యంగా మంచి విప్లవనిర్మాణాన్ని సాధించగల్గుతున్నది. కాని కేంద్రంలో మాత్రం గాభరా, గలభా అరాజకత్వము సాధారణంగా ఉంటున్నాయి. ప్రాథమికమైనపనివిభజనకూడా కొన్నిసార్లు వుండదు. మనరహస్యశాఖ లాభంకంటే ఎక్కువ నష్టము తెచ్చేఅంత అధ్వాన్నంగా నిర్మాణపరచబడుతుంది. పోస్టలు తదితర మార్గాలమీద ఆధారపడదు. రహస్యంగా పనిచేస్తున్న పోస్టలు, రవాణా, పార్టీకేంద్రము, ముద్రణాలయాలు సాధారణంగా, అదృష్టముమీదనే ఆధారపడి పనిచేస్తున్నాయి. శత్రువుల ఏజంటులు ప్రవేశించడానికి మంచి అవకాశాలను యిస్తున్నాయి.

పార్టీ ఇందుకుగాను ప్రత్యేక శాఖను నిర్మించితే తప్ప ఈ లోపాలనుసరిదిద్దుకోజాలదు. మిలిటరీలో రహస్యాలు సేకరించే శాఖకు ప్రత్యేక తర్ఫీదు. విజ్ఞానము, సాధనము అవసరం. రాజకీయ పోలీసులకు వ్యతిరేకంగా నిర్మించే శాఖ విషయంకూడా ఇంతే. దీర్ఘానుభవం ద్వారామాత్రమే బలమైన రహస్యశాఖను నిర్మించగలదు. పార్టీ ఎంతచిన్నదిగా ఉన్నాసరే ప్రతిలీగలు పార్టీ విప్లవము యొక్క ఈ ప్రత్యేక

పనికి సన్నాహాలు చేసుకోవాలి. పూర్తి బహిరంగ కార్య క్రమము ద్వారానే ఈరహస్య యంత్రాన్ని నిర్మించడానికి చాలా సార్లు అవకాశం ఉంటుంది.

ఉదా: చట్టసమ్మతమైన కరపత్రాలు జాగ్రత్తగా పంపకం చేయడంద్వారాను. పత్రికలఉత్తర ప్రత్యుత్తరాల ద్వారాను జరిపే కోడ్ భాషతో రహస్య పోస్టలు రవాణా శాఖలను నిర్మించడం చాలావరకు సాధ్యపడుతుంది.

59. ప్రతి సభ్యుని, విప్లకార్మికుని భవిష్యత్తులో విప్లవ సైన్యానికి ఒక సైనికునిగా, పార్టీ ఆర్గనైజరు ఎంచాలి. అతని భవిష్యత్తు పాత్రకుఅనువైన కార్యక్రమాన్ని యిస్తూఉండాలి. పార్టీ ప్రస్తుత పనికి అతని నేటికార్యక్రమం ఉపయోగ పడే టట్లుండాలి. ఊరికే డ్రిల్లు చేయించుతూ ఉండడం నేటి కార్మికుడు తిరస్కరించుతాడు. ప్రతి కమ్యూనిస్టుకు ఈకార్య క్రమమే అంతిమ పోరాటానికి పూర్తిగా తర్ఫీదు చేస్తుందని గుర్తించుకోవాలి.